నృసింహశాస్త్రిగ్రంథమాలా—3.

శ్రీమద్రామాయణవ్యాఖ్యా



(ఆంధ్రతాత్పర్యసహితము.)



గ్రంథకర్త:

బొమ్మకంటి నృసింహశాస్త్రి.

ఓం నమః

శ్రీ పరమర్షిభ్యో యోగిభ్యః

శుభమస్తు సర్వజగతామ్॥



శ్రీ మ ద్రా మా య ణ వ్యా ఖ్యా



శ్రీమ దాంధ్రదేశీయ గోదావరీమండలాంతర్గత భీమేశ్వరపురీ
వాస్తవ్య శ్రీ చంద్రాభట్ల గౌరీపతిశాస్త్రిణాం చరణకమల
సేవాసమాసాదిత పూర్ణదీక్షాపవిత్రీకృత మానసేన
బొమ్మకంటి పేరుశాస్త్రిశర్మణః సుభద్రాం
బాయాశ్చ గర్భసంభూతేన చతుర్థపుత్రేణ
నృసింహశాస్త్రిణా విరచితా తజ్జ్యేష్ఠ
పుత్ర(శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి)
విరచితార్థతాత్పర్య
[illegible]
సహితా

తృతీయసంపుటం.

**1940**

సర్వస్వామ్యసంకలితం] [మూల్యం రు. 1—0—0

# స్వవిషయము.

శ్రీమత్పరదేవతాచరణారవిందసేవామృతంబును గ్రోలి ధన్యులైన మత్పితరుల దివ్యవాక్కులందు చిత్కలాస్వరూపిణి తన కరుణాపాంగవీక్షణంబులఁ బ్రసరింపఁజేసి సకలజనవాంఛితార్థదంబగు శ్రీ కల్పవల్లికనుఁ బ్రసాదించుటచే నద్దానిని గ్రంథకర్తల యాశీఃప్రభావమున నాంధ్రానువాదసహితము నాంధ్రలిపిని సంపూర్ణముగ ముద్రింపించి ప్రకటింపఁగలిగితిని. గ్రంథకర్తల వంశచరిత్రము, గ్రంథావలోకనంబును, సంపుటమున కాద్యంతములయందుఁ జేర్చి యున్నాఁడను.

ప్రథమసంపుటముపైని వెలువడిన పత్రికాభిప్రాయములనుగూడ స్థాలీపులాకముగ నిచ్చుటఁ బొందుపఱచినాఁడను.

ఈ కల్పవల్లికాకిసలయమకరందపానమునుఁ జేయు మహాభాగ్యము సంస్కృతభాషాజ్ఞానము గలిగియు నాంధ్రలిపియం దపరిచితుల కలభ్యమగుటచే నీగ్రంథమంతయు నాగరలిపినిఁ గూడ ముద్రించుట యావశ్యకముగఁ గానంబడియెడి.

ఇదియునుంగాక ద్వైతమతవిమర్శనాభూయిష్ఠమై విద్వద్దామథమున నొప్పు 'మణిమంజరీవిశ్లథ' మును, శ్రీ విక్టోరియా మహారాజ్ఞని శ్రీదేవియపరావతారమని సమర్థించుచు నైషధాదిమహాకావ్యముల శైలిననుకరించి రచింపఁబడిన 'తారావళి' యును, సద్భుత కవితాశక్తిని బ్రదర్శించి వర్ణించిన 'తిలకసహస్రం'బునఁ గొన్ని శ్లోకంబులును, ప్రకీర్ణశ్లోకంబులు కొన్నియు నత్యల్పకాలముననే ముద్రణస్థాన మలంకరింపవలసి యున్నది.

ఈమహాత్కార్యముఁ గొనసాగించు టశక్తుఁడనైన నేను యత్నించుట హాస్యాస్పదమైనను భాషాభిమానులును దేశాభిమానులును స్మారకనిధికి సంబంధించిన ముద్రితగ్రంథములను స్వీకరించి, యథాశక్తి ప్రోత్సాహ మొసంగినచో యీకార్యము నిర్విఘ్నముగఁ గొనసాగుటయేగాక గ్రంథకర్తల యశఃకాంతులు దిగంతవిశ్రాంతమై దేశౌన్నత్యమునకుఁ గూడ కారణమగుననియు నా దృఢవిశ్వాసము.

ఇట్లు,
గ్రంథప్రకటనకర్త.

---

# గ్రంథకర్తవంశచరిత్రము.

శ్లో॥ శారీరే శాబరే వా ఫణిపతిఫణితే కర్కశే తర్కశాస్త్రే।
శ్రౌతే స్మార్తే చ కర్మ ణ్యవిహతగతయ శ్శ్రీగిరీశప్రసాదాత్ ।
సంఖ్యాతాస్సాంఖ్యశాస్త్రేఽధ్వని హారితమునే రన్వయం భాసయన్తో ।
జానన్తి బ్రహ్మదృష్ట్యా జగ దసదితి తే బ్రహ్మదృగ్వంశవర్యాః॥

బొమ్మకంటి (బ్రహ్మదృక్) వంశోత్తములు పూర్వోత్తర మీమాంసలయందు, వ్యాకరణశాస్త్రమందు, కర్కశమైన తర్కశాస్త్రమందు, శ్రౌతస్మార్త కర్మలయందును సాంఖ్య యోగశాస్త్రమందను, యీశ్వరానుగ్రహంబున నప్రతిహతమైన పాండిత్యము గలిగి, హారితసమునియొక్క గోత్రము నలంకరించి తత్త్వదృష్టిచే జగత్తునసద్రూపమని చెలిసికొనినవారు. అని యీవంశబిరుదప్రకాశకమైన శ్లోకమును పెద్దాపుర సంస్థానాధిపతులగు శ్రీ తిమ్మజగపతిప్రభువులు తదాస్థానసంశ్రితులగు

బొమ్మకంటి సాంబశివశాస్త్రిగారికి సన్మానపారితోషికపురస్సరంబుగ సమర్పించియుండిరి.

ఇటుల నీ వంశప్రసిద్ధినిఁ దెలుపునట్టి యీ శ్లోకరాజము మాత్రము నా స్ఫురణలో నున్నయది. ఇంతకంటె పూర్వుల చరిత్రనుఁ దెలుపునట్టి నిదర్శనములంతగ నాకుఁ దెలియుటలేదు. కాని మా ప్రపితామహుల నారంభించి మావంశీయుల దెలుపు శ్లోకములఁ దాత్పర్యసహితముగఁ నిచ్చటఁ దెలుపుచున్నాఁడను.

శ్లో॥ అస్తి ర్యాలీతికశ్చిజ్జనపదతిలక స్సప్తగోదావరాఖ్యే ।
క్షేత్రే తే దివ్యనద్యా యుపభివిలసతో గౌతమీ సా వసిష్ఠా ।
తత్రాసీ ద్వేంకటాఖ్యోపపదయుత నృసింహాభిధానో ద్విజన్మా ।
త్రైలింగో బొమ్మకంట్యాహ్వయకులజని మాన్యగ్రణీః పండితానాం॥

ఈ బొమ్మకంటివంశమందు సప్తగోదావరిక్షేత్రమున పుణ్యనదులగు గౌతమీ వసిష్ఠల నడుమ ర్యాలియను గ్రామము నందు, పండితాగ్రేసరులు, త్రిలింగులు, నగ్రజన్ములు నగు వెంకటనృసింహశాస్త్రి యను వార లుండెడివారు.

శ్లో॥ సుబ్రహ్మణ్యశాస్త్రీతిసూనురగ్ర్యో । ద్వైతీయీకః పేరుశాస్త్రీతి విఖ్యః॥
తస్యోదాస్తామగ్రహణీయౌమహాత్మౌ । సాస్వాత్మారామౌ తత్త్వదృష్ట్యాచనిత్యం।

వీరికి జ్యేష్ఠులు సుబ్రహ్మణ్యశాస్త్రి ద్వితీయులు పేరుశాస్త్రి యను నిరువురు పుత్రులు మహాత్ములును తత్త్వదృష్టిచే నెల్లపు డాత్మానుసంధానముగలవారును నై యుండెడివారు. వీరిలో జ్యేష్ఠులు వెంకటనృసింహశాస్త్రి యను పుత్రరత్నమునుఁ బడసిరి. వీరలు గోదావరీతీరమున కుమారదేవ మను నగ్రహార మందు నివాసస్థాన మేర్పరచికొని యామరణాంతము శక్త్య

పాసకులై తత్ఫలితముగ ననేక యద్భుతకార్యములను లోక మునఁ బ్రదర్శించి యప్రతిగ్రహవ్రతులై నిరతాన్నప్రదాతలై దేశవిఖ్యాతిఁబడసిన యశోధనులు.

శ్లో॥ తత్ర ద్వితీయా స్తపసాన్నిధేస్తు । పుత్రాష్షడా సన్నిగమాగమజ్ఞాః॥

ద్వితీయులు తపోనిధులును నగు పేరుశాస్త్రిగారికి వేద శాస్త్రవేత్తలైన నార్గురుపుత్రు లుండిరి.

శ్లో॥ జగ్గ శ్చంద్రశ్చ తాంతశ్చ । అచ్చనశ్చ తథైవచ ।
రామస్వామీ నృసింహశ్చ । షడైతే పేరుసూనవః॥

(6) జగ్గన్నశాస్త్రి (5) సీతారామశాస్త్రి (చంద్రః) (4) నృసింహశాస్త్రి (తాంతః) (3) అచ్చన్నశాస్త్రి (2) రామ స్వామిఅవధానులు (1 వెంకటనృసింహశాస్త్రి. ఈఆర్గురు పేరు శాస్త్రిగారి పుత్రులు. అని కనిష్ఠజ్యేష్ఠానుక్రమముగ సాంకే తికనామములతోఁ గూర్పఁబడిన యీశ్లోకము జనసామాన్యము నం దాంధ్రదేశమం దంతటనుఁ బ్రసిద్ధముగనున్నయది. ఈషట్క ములో తురీయులగు సీగ్రంథకర్తల జీవితచరిత్రము విపులము గను, తదితరులను గురించి సంగ్రహముగను వంశావళిఁ గూడఁ జేర్చి ప్రథమసంపుటమున వివరించియున్నాడను.

ఈవంశవృక్షము శాఖోపశాఖలతోఁగూడినదై కుమార దేవం, విప్పర్రు, ఆకిరిపల్లి, నిడదవోలు, పెనుమదం, పలివెల, పెదకళ్ళేపల్లి, ఏనుగుమహలు, తోట్రేను, గోడవర్రు, కాళీ పట్నం, సామర్లకోట గ్రామములనుఁ గూడ నలంకరించినదని యెరుంగునది.

బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

# పత్రికాభిప్రాయములు.

## ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

(సంపుటము ౨౯. సంచిక ౧.)

ఆసేతు హిమాచలము భక్తిశ్రద్ధలతోఁ బఠింపఁబడు శ్రీమద్రామాయణమున కిది యొకనూతన వ్యాఖ్యానము. ఈ మహాగ్రంథమున కిదివఱలో ద్వైతవిశిష్టాద్వైతపరముగ నెన్నియో వ్యాఖ్యానములు గలవు. వ్యాఖ్యానచతుష్టయముతో నీగ్రంథము వావిళ్ళవారు ప్రకటించియున్నారు. గ్రంథకర్త లాంధ్రదేశమున సుప్రసిద్ధపండితబృందముని ప్రశస్తిఁగాంచిన 'బొమ్మకంటివంశ'మున తురీయులు. వ్యాకరణ, న్యాయ, వేదాంత మీమాంసాదిశాస్త్రములయందుఁ బాండిత్యము కలవారు. సంస్కృతభాషయం దీ నూతనవ్యాఖ్యానమును రచించి శ్రీరాముని శక్తిస్వరూపునిగ వీరిందుఁ బ్రతిపాదించియున్నారు. వ్యాఖ్యానవిషయములఁ బామరులకుఁ దెలుపుటకై వీరిపుత్త్రులు దీని నాంధ్రీకరించి మూలముతోఁ బ్రకటించిరి. చతుర్వింశత్యక్షరాత్మకమగు గాయత్రీమంత్రము రామాయణమున ననుసంధింపఁ బడుటచే దేవీపరముగ రచించుటయే వాల్మీకి యభిప్రాయమై యుండునని నిశ్చయించి గ్రంథకర్త లీవ్యాఖ్యానమును రచించిరి. శ్రీమద్రామాయణమున కెందరెన్నివిధముల వ్యాఖ్యానముల రచించినను నది గ్రంథోత్కర్ష హేతువే యగును. కేవలము శక్తిపరముగ రామాయణము నన్వయించుటయేగాక వీరు ప్రాచీనవ్యాఖ్యానములఁగూడ విమర్శించి కొన్నితావుల నూతనవిషయములఁ దెలిపియున్నారు. ఈకల్పవల్లికా వ్యాఖ్యానమును జదివి విజ్ఞు లానందింతురుగాక.

## కృష్ణాపత్రిక.

(ది 14 సెప్టెంబరు 1940. సంపుటము 39. సంచిక 33.)

ఉద్దండులైన పండితులును కీర్తిశేషులు నగు శ్రీ నృసింహ శాస్త్రిగారు ఆదికావ్యమగు శ్రీమద్రామాయణమునకు గల "సకల వ్యాఖ్యానములను ప్రత్యక్షరమును శోధించి తమకుం దోచిన విశేషములను వెల్లడింప వలెనను నుద్దేశముతో 'కల్పవల్లిక' యనుపేర నీ వ్యాఖ్యానము రచించుటకుగాను తదేక దీక్షతో నష్టాదశ పురాణములను భారతాదితిహాసములను విశకలితముగ శోధించి, తత్సారమునంతయును హృద్గత మొనర్చుకొని పిమ్మట నీవ్యాఖ్య రచింప నుపక్రమించిరి."

"సోపపత్తికముగను, సయుక్తికముగను శ్రీ శాస్త్రిలవారు రామాయణము నంతయు దేవీపరముగ వ్యాఖ్యాన మొనరించినారు."

వారి జ్యేష్ఠపుత్రులచే నీగ్రంథము ప్రకటించబడినది. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి పీఠిక గలదు. గ్రంథకర్తల జీవిత చరిత్ర మున్నది. మఱియు పండితాభిప్రాయములు గలవు. బాల కాండకు సంపూర్ణముగ వ్యాఖ్యాన మిందున్నది. మూలమంతయు తెలుగులిపిలో సంస్కృతభాషయం దున్నది. సుబోధకమగు తెలుగులో అనువాద మున్నది.

శ్రీ నృసింహశాస్త్రిగారి ఈయత్న మెంతఉదాత్తమో తత్ఫలితమగు నీవ్యాఖ్యయు అంత ఉత్కృష్టమై వెలయుచున్నది. సంస్కృతజ్ఞానము లేనివారికి గ్రంథప్రభావము తెలుగు టీక వలన తెలియనగును. శ్రీ శాస్త్రిలవారు అనాసక్తులేమై అపరిగ్రహవ్రతులైనను ఆంధ్రలోకము శ్రీ వారికి ధన్యవాదములు

చెప్పుకొనవలసి యున్నది. మఱియు వారి జ్యేష్ఠపుత్రులు ఈ ప్రకటన కార్యమునకు పూనుకొన్నందున మా ప్రోత్సాహ వాక్యము వ్రాయుచున్నాము.

---

## విభూతి.

(July 1940 Vol. 2 No. 5.)

వాల్మీకిరామాయణమునకు ప్రాచీనపండితు లనేకులు సంస్కృతటీకలను విరచించి లోకోపకార మొనర్చుటయేకాక తమతమ ప్రతిభాసంపత్తివలన స్వస్వసంప్రదాయ సిద్ధాంతములను సైతము హృదయంగమముగ నిరూపించినారు. రమణీయమైన రామాయణమును విద్యానిధులగు పండితులు తరచిన కొలదియు నూతనస్వారస్యములు బైటబడుచునే యుండుననుట కీకల్పవల్లికయే సాక్షి. సుప్రసిద్ధులైన బొమ్మకంటి పండితసోదరులలోని వారగు నృసింహశాస్త్రిగారు రామాయణమునకు కల్పవల్లికయను పేరుతో మఱియొక క్రొత్తవ్యాఖ్యానమును విరచించి తమ యనుపమానమైన విద్యాశక్తిని వెల్లడించినారు. ఈకాండము చాలభాగము నవలోకించి సంతసించితిమి.

శాస్త్రిగారు శాక్తతత్వము నిరూపించుటకీ వ్యాఖ్యానము రచించినను అనేకచోటులలో నీవిషయములు శైవానుకూలముగను కుదిరినవి. శాస్త్రిగారు పుత్రులైన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ముచ్చటైన ఆంధ్రతాత్పర్యము కూడ వెనువెంట నుంచుటవలన పాఠకజనుల సౌకర్య మినుమడింపబడినది. రామాయణానురాగు లంద రీకల్పవల్లికా రామాయణము తప్పక నవలోకింపగోరుచున్నాము.

# శ్రీమద్రామాయణే, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండేషు వ్యాఖ్యాత శ్లోకానుక్రమణికా.

| క్రమ సంఖ్యా | సర్గః | శ్లోక సంఖ్యా | శ్లోకవివరణం. | పుటం |
|---|---|---|---|---|
| | | | అరణ్యకాండే | |
| 1 | 1 | 1 | ప్రవిశ్యతు మహారణ్యం | 2 |
| 2 | ,, | 18 | ధర్మపాలో జనస్యాస్య | 6 |
| 3 | ,, | 19 | ఇంద్రస్యైవ చతుర్భాగః | 7 |
| 4 | ,, | 20 | తేనయంభవతారక్ష్యా | 9 |
| 5 | ,, | 21 | న్యస్తదండావయం రాజన్ | 11 |
| 6 | 2 | 16 | తాందృష్ట్వా రాఘవస్సీతాం | 14 |
| 7 | ,, | 17 | పశ్య సౌమ్య నరేంద్రస్య | ,, |
| 8 | ,, | 18 | అత్యంతసుఖసంవృద్ధాం | ,, |
| 9 | ,, | 19 | కైకేయ్యాస్తు సుసంవృత్తం | ,, |
| 10 | ,, | 20 | యథాహంసర్వభూతానాం | ,, |
| 11 | ,, | 21 | పరస్పరాత్తు వైదేహ్యా | ,, |
| 12 | ,, | 25 | రాజ్యకామే మమక్రోధో | 16 |
| 13 | 6 | 10 | త్వామాసాద్యమహాత్మానం | 18 |
| 14 | ,, | 11 | అధర్మస్సుమహాన్నాథ | ,, |
| 15 | ,, | 12 | యోఽయంజానన్సన్నివప్రాణాన్ | ,, |
| 16 | ,, | 13 | ప్రాప్నోతిశాశ్వతీంరామ | ,, |
| 17 | ,, | 14 | యత్కరోతి పరంధర్మం | ,, |
| 18 | ,, | 15 | సోఽయం బ్రాహ్మణభూయిష్ఠో | 18 |
| 19 | ,, | 16 | ఏహిపశ్యశరీరాణి | ,, |
| 20 | ,, | 17 | పంపానదీ నివాసానాం | ,, |
| 21 | ,, | 18 | ఏవంవయం నమృష్యామో | 19 |
| 22 | ,, | 19 | తతస్త్వాంశరణార్థంచ | ,, |
| 23 | ,, | 20 | పరాత్వత్తోగతిర్వీర | ,, |
| 24 | 10 | 18 | అప్యహంజీవితంజహ్యాం | 21 |
| 25 | 16 | 27 | అస్మింశ్చ పురుషవ్యాఘ్రః | 22 |

| క్రమ సంఖ్య | సర్గః | శ్లోక సంఖ్య | శ్లోకవివరణం. | పుటం |
|---|---|---|---|---|
| | | | యుద్ధకాండే | |
| 48 | 18 | 1 | అథరామఃప్రసన్నాత్మా | 62 |
| 49 | ,, | 2 | మమాపితు ర్వివక్షాస్తి | 65 |
| 50 | ,, | 3 | మిత్రభావేనసంప్రాప్తం | 68 |
| 51 | ,, | 35 | రామస్యతువచశ్శ్రుత్వా | 80 |
| 52 | ,, | 36 | కిమత్రచిత్రం ధర్మజ్ఞ | 81 |

ఓం

శ్రీమత్పరమగురుభ్యోనమః

శ్రీమద్రామాయణే

# అరణ్యకాండ వ్యాఖ్యాప్రారంభః

శ్లో॥ శ్రీదేశికేంద్ర చరణాబ్జయుగం ప్రణమ్య।
తద్ధూళిసంగతి సముల్లస దుత్తమాంగః।
శ్రీదేవతావిభవ దాశరథే శ్చరిత్ర।
మారణ్యకాండకథితం వివృణోమి శక్త్యా॥

తా॥ శ్రీ గురువర్యుల చరణారవిందయుగమునకు నమస్కరించి ఆపాదధూళిచే విరాజిల్లెడు శిరస్సుగలవాడనై, శ్రీదేవతా విభవమైన శ్రీరామచరిత్రమునందలి అరణ్యకాండ విషయమును శక్తికొలది వివరించుచున్నాడను.

అత్ర కాండే జగత్పాలనార్థం శ్రీరామరూపే ణావతీర్ణాయా శ్రీదేవ్యాః శిష్టపాలన దుష్టశాసనరూపం ధర్మం లోకానుజిఘృక్షయా స్వారస్యేన ప్రతిపాదయతి॥

తా॥ ఈకాండయందు జగత్పాలనమునకై శ్రీరాముని రూపమున అవతరించిన శ్రీదేవి యొనరించిన శిష్టపరిపాలన దుష్టనిగ్రహరూపములతో కూడిన ధర్మమును, వాల్మీకిమహర్షి లోకముల ననుగ్రహింపవలెనను నూహచే స్వారస్యముగ సమర్థించి ప్రకటించుచున్నాడు.

స 1. శ్లో॥ 1. ప్రవిశ్యతు మహారణ్యం దండకారణ్య మాత్మవాన్।
దదర్శరామో దుర్ధర్ష స్తాపసాశ్రమమండలం॥

వ్యా॥ ఆత్మవాన్- నిగృహీతచిత్తః । అత ఏవ దుర్ధర్షః- పరై రభిభవితుమశక్యః । మహారణ్యం- దేశతో వస్తుత శ్చ పరిచ్ఛేదరహితం- అనంత మితి యావత్ । దండకారణ్యం- దండకనామ రాజపరిపాలిత మపి కేనచి న్నిమిత్తేన శుక్రశాప బలా దరణ్యభూతం । ప్రవిశ్యతు- ప్రవేశానన్తర మేవ । తాప సాశ్రమమండలం- రాక్షసభయా దన్యోన్యసాహాయ్యకార్థ మ త్యంత సంశ్లిష్టసన్నివేశయుత మాశ్రమసముదాయం । దదర్శ- అదృష్టచరానేకతరుగుల్మాదిభూయిష్ఠత్వే నాత్యాశ్చర్యతయా ద్రష్టవ్యసకలపదార్థజాత మపి సంత్యజ్య సుకృతాతిశయ ప్రయోజకానన్యసాధారణనియమవత్తయా తథావిధ ముని సంఘనివాసభూత మాశ్రమమండల మేవ ప్రథమ మపశ్య దిత్యర్థః। చపలచిత్తానాం తాదాత్వి కేంద్రియమాత్ర ప్రీతిజనక వినోదదర్శనత్వరా । నహి జితేంద్రియః ప్రాకృతేషు రమత ఇతి భావః । నియమవతాం తు సుకృతాభిలాషిణాం సాధుదర్శ నానురాగాదివా - తత శ్చ రాజతేజఃపరిభావిబ్రహ్మవర్చసస్య మహాత్మ్య మనుసంధాయ, తతోఽపి మహత్తర స్వనియమబలే న దండకారణ్యాం। పునశ్చ తాదృశ బ్రాహ్మసంరక్షణేన శోధ యిష్య చ్ఛ్రీరామవ్యాపారే చిత్తనిగ్రహ ఏవ ఉత్తరోత్తర మధి కః । నతు జాతిభేదనిబంధన ఇతి సూచ్యతే । ఏతేన నిఖిలరాక్షస విజయరూపప్రశేషయోవి శేషస్య తపస్విదర్శనం మూల మితి శ్రీరా

మస్య హృదయం। అథవా తు శబ్దో భిన్నక్రమః। తాపసాశ్రమ మండలం దదర్శ - న త్వన్యది త్యన్వయః। చిరాదారభ్య దండ కారణ్య మహాధ్వసం కర్ణాకర్ణి కయా రాక్షసప్రాబల్యేన తపస్వి పీడాహేతుకం కథాం శృణ్వాన్ సాధురక్షణం కృత్వా క్షత్రం సార్థకయా మీత్యభినివేశేన దండకారణ్యప్రవేశావ్యవధానేన తద్దర్శన మేవ కృతవాన్ రామ ఇతి తస్య గుణశ్రేష్ఠతా ధ్వని శ్చేత్యాద్యూహ్యమ్। ఇత్థంచ- "అహం గమిష్యామి మహావనం ప్రియే" ఇతి సీతాసన్నిధౌ స్వకృతప్రతిజ్ఞాయా శ్చేద మేవ ఫల మితి సిద్ధం। యద్యపి ఆత్మవా నిత్యాది విశేషణబలేన రామ స్య రాక్షసాద్యపాదానక భయాభావ తాత్పర్యకత్వకల్పన మపి న్యాయ్యం। తథాపి గుణభూతప్రవేశక్రియాయాం విశిష్టకర్తు రన్వయః। ప్రధానదర్శనక్రియాయాం కేవలం కర్తురేవా న్వయ ఇతి వైషమ్యం స్యాత్। తతశ్చ 'విద్వాన్ దైవదత్త స్సభాం ప్రవిశ్య పరాబభూవే' త్యాదావివ అనర్థకపదత్వదోషాపత్తిః। విరుద్ధపదత్వం వా దోషః। అథ యథాకథంచి దర్థభేదేన విశి ష్టాన్వయస్స్యాత్ తదా తాదృశార్థభేదస్య విశేషణవాచక పదానా మావృత్త్యా దన్యతమ మంతరా ఽసంభవా ద్వాక్య భేద ఇతి స ఏవ దోష ఇత్యలం॥

తా॥ "ఆత్మవాన్" నిగ్రహముతో గూడిన చిత్తము గలవాడు. కావుననే 'దుర్ధర్షః' ఇతరులచే తిరస్కరింప శక్యము గానివాడు నగు శ్రీరాముడు 'మహారణ్యం' దేశము చే గాని వస్తువుచే గాని పరిమితి నేర్పఱుప శక్యము గానిది. అంతము

లేనిదని నిశ్చయార్థము. 'దండకారణ్యం' దండకు డను రాజుచే పాలింపబడు దేశమయ్యును ఒకానొక కారణముచే శుక్రాచార్యుని శాపబలముచే అరణ్యమైన దేశమును, 'ప్రవిశ్యతు' ప్రవేశించిన తోడనే, "తాపసాశ్రమమండలం" రాక్షసుల వలని భీతిచే, ఒకరి కొకరు సాయపడుటకై దగ్గరగ నేర్పరిచికొనిన నివాసములు గల ఆశ్రమసమూహమును, 'దదర్శ' చూచెను. ఇంతకు ముందెన్నడు చూడని వృక్షములు పొదలు మున్నగు వానితో గూడి యుండుటచే, మిక్కిలి ఆశ్చర్యముగ చూడదగిన సమస్త పదార్థసమూహమును వదలి, పుణ్యవిశేషమునకు ఫలమైనట్టియు, ఇతరులకు సాధ్యము కానిదియు నగు నియమములతో గూడిన మునిసంఘములకు నివాసస్థానమైన ఆశ్రమ సమూహమునే తొలుత జూచె నని యర్థము. చపలచిత్తులకు అప్పటికి ఇంద్రియతృప్తిని గలుగజేయు వినోదముల జూడ తొందర గలుగును. నియమముతో గూడి సుకృతము నపేక్షించువారి కన్ననో, సత్పురుషులను జూడవలె నను ప్రీతియే గల్గును. కాని జితేంద్రియములు ప్రాకృతవిషయములయందు రమించరని భావము. కావున క్షత్రియతేజమును తిరస్కరించు బ్రహ్మతేజముయొక్క మహాత్మ్యమును భావన చేసి, మహత్తరమైన తన నియమబలముచే, దండకారణ్యమును అట్టి బ్రాహ్మరక్షణమున (బ్రహ్మతేజోరక్షణమున) శోధింపనెంచిన శ్రీరాముని వ్యాపారమునందు చిత్తనిగ్రహమే ఉత్తరోత్తరముగ నధికముగ గన్పట్టుచున్నది. జాతిభేదముతో గూడిన నిబంధనము గనుపించుట

లేదని సూచితమగుచున్నది. దీనిచే సమస్తరాక్షసులను జయించుట యనెడి శ్రేయోవిశేషమునకు తపశ్శాలురదర్శనముచేయుటయే మూలమని శ్రీరాముని యభిప్రాయము.

లేదా, 'తు' అను శబ్దమును భిన్నమైన క్రమముచే నన్వయించుకొనవలెను. "తాపసాశ్రమమండలం దదర్శ" తపశ్శాలుర ఆశ్రమసమూహమును జూచెను. ఇతరమును జూడలేదని యర్థము. చిరకాలమునుండి రాక్షసులు ప్రబలులై తపశ్శాలురకు బాధను గల్గించుచున్నారని దండకారణ్యమున బయలుదేరిన ధ్వనిని కర్ణాకర్ణికగా వినుచు, సత్పురుషులను రక్షించి, క్షాత్రమును సార్థకము చేసికొనెద నను పట్టుదలతో, దండకారణ్యమును ప్రవేశించిన వెంటనే ఋషుల దర్శనమునే శ్రీరాముడు చేసినాడనుటచే ఆతని యందు గల గుణశ్రేష్ఠత ధ్వనించుచున్నదనియు మొదలగునవి యూహించునది. దీనివలన "ప్రేయసీ! నేను మహారణ్యమునకు బోయెదను" అని సీత సమక్షమున జేసిన ప్రతిజ్ఞకు నిదియే ఫలమని సిద్ధమైనది.

ఆలోచింపగ, "ఆత్మవాన్" మున్నగు విశేషణముల బలముచే శ్రీరామునకు రాక్షసుల వలన భయము లేదను తాత్పర్యమును కల్పించుటయే న్యాయము. కాని, అప్రధానమైనక్రియయందు విశిష్టకర్త కన్వయము గల్గును. ప్రధానమైన దర్శనక్రియ యందు, కేవలము కర్తకే అన్వయము. ఈరీతిగ వైషమ్యము (తేడా) సిద్ధించును. విద్వాంసుడు-దైవముచే సీయబడినవాడు- సభను ప్రవేశించి- పరాభూతుడాయెను. ఇత్యాది

వాక్యమందు వలె అర్థరహితపదములు గలుగుట యనెడి దోషము సంభవించును. విరుద్ధపదములు గలుగుట యనెడి దోషమైనను సంభవించును. మఱియు ఏదియో యొక విధమున అర్థభేదముచే విశిష్టాన్వయము కలిగినను అట్టి యర్థభేదము విశేషణపదముల కావృత్తి మున్నగునది లేక సంభవింపదు గాన వాక్యభేద మను దోషము తప్పదు. కావున నింతటితో విరమింతము.

స 1. శ్లో॥ 18. ధర్మపాలో జనస్యాస్య శరణ్య స్త్వంమహా
యశాః ! పూజనీయశ్చ మాన్యశ్చ రాజా దండధరో గురుః॥

స 1. శ్లో॥ 19. ఇంద్రస్యేహ చతుర్భాగః ప్రజా రక్షతి రాఘవః।
రాజా తస్మా ద్వరా న్భోగా న్భుఙ్క్తే లోకనమస్కృతః॥

వ్యా॥ ధర్మపాలః- ధర్మేణ, ధర్మం వా పాలయతీ త్యనేన అనియమప్రవృత్తికజనానాం సర్వేషా మపి ప్రీత్యుత్పాదనద్వారా వర్ణాశ్రమాచారాదిషు తాంస్తా న్జనా న్ప్రవర్తయతీ త్యేకోఽభిప్రాయః । ప్రజానాం స్వాచ్ఛంద్యేన ప్రవృత్తౌ కాలభేదేన ఇహ చ పరత్ర చ శ్రేయోహాని స్స్యాత్ । తచ్చ యథాన్యాయ మప్రవర్తకస్య రాజ్ఞో ఽనిష్టావహ మితి బుధ్వా సర్వం చాపి జన మవైషమ్యేన పాలయతీ త్యపరః ! ఇతి కిం వైషమ్యం। కించ, ఉత్తమాదిభేదాభావేన సర్వస్యాపి జనస్య సతి సంకటే శరణీభూయ యత స్తదాపన్నివర్తక ఇత్యర్థః । శరణ్య ఇతి- రాజా హి యస్య కస్య వా స్వప్రాభవప్రకటనేన ఉపకరోతు నామ । తావతా తం స పురుషః కీర్తయత్యేవ । త్వం

తు మహాయశాః సర్వప్రజానాం సాధారణ్యేన శరణ్య ఇత్యపరి చ్ఛిన్నశ్లాఘాస్పద ఇత్యర్థః । అతః పూజనీయః- జన్మతపోవిద్యా దినా యే త్వయా పూజ్యంతే తేషా మపి శ్రుతిస్మృత్యా ద్యుక్తమార్గేణ పారమార్థికశ్రేయోఽర్థినాం భగవద్బుద్ధ్యా పూజనీయః । రాజా తు తాదాత్వికఫలలాభా యేతి భావః । అతః మాన్యః- లోకస్థితయే యథా త్వం దండ యసి స ఏవ ధర్మః- నేతర ఇతి విద్వద్భి రనుల్లంఘనీయశాసన ఇత్యర్థః । అత ఏవ రాజా- రంజనగుణేన సార్థకపదవిశిష్టః । దండధరః - గుణ దోషవిమర్శపూర్వకం దండ ముపయుజ్య ప్రజా స్స్వేనసాకం సద్గతిం ప్రాపయ తీత్యర్థః । అత స్స్వాచారముఖేన సర్వేషా మపి సన్మార్గోపదేష్టృత్వా ద్గురుః నతు కస్యాపి శిష్య ఇత్యర్థః॥

వ్యా॥ ఇంద్రస్య పరమేశ్వరస్య సర్వశక్తివిశిష్టస్య చతు ర్భాగః పురుషార్థచతుష్టయప్రాపకచతురంశసముదాయః। ఇహ లోకే రాజా సన్ యః రక్షతి- పురుషార్థచతుష్టయమార్గప్రాప ణేన చతుర్భి రపి మార్గైః ప్రజాః ప్రవర్తయతి- సః సర్వలోక నమస్కృత స్సన్, వరాన్ భోగా ననూ నుపాభుఙ్క్తే । యస్తూక్తచతుర్భేదశక్తిమధ్యే ఏకైకశక్తివిశిష్ట ఏవ లోకే రాజా సన్ లోకం పాలయతి సః ఇహ సర్వభోగ్యపి "రాజ్యాన్తే నర కం ధ్రువ" మితి న్యాయేన సర్వనింద్య స్స న్నధఃపత తీత్యర్థః॥

తా॥ 'ధర్మపాలః' ధర్మముచేగాని, ధర్మమునుగాని, పాలించువాడు. ఇట్లనుటచే నియమము లేకుండ ప్రవర్తించెడి జనులందరకు సంతోషమును గల్గించుచు, వర్ణాశ్రమధర్మము

లందు ఆయాజనులను ప్రవర్తింపజేయుచున్నావని యొక అభి
ప్రాయము. ప్రజలు స్వేచ్ఛగ ప్రవర్తింప మొదలిడినచో కాల
భేదముచే ఇహపరలోకములయందు శ్రేయస్సునకు హాని కల్గును.
అది యథాన్యాయముగ ప్రవర్తింపజేయని రాజునకు అనిష్టమును
కలుగజేయునను బుద్ధిచే సమస్తజనులను హెచ్చుతగ్గులు
లేకుండ పరిపాలించుచున్నావని మఱియొక అభిప్రాయము.
కావున వైషమ్య మేమున్నది. మఱియు నీకు ఉత్తముడు అధ
ముడు అను భేదదృష్టి లేకుండుటచే జనులందరకు కష్టము
తటస్థించినపుడు రక్షకుడవై వారియాపత్తులను తొలగించు
చున్నావని యర్థము. "శరణ్యః" రాజైనవాడు తన ప్రభు
త్వమును ప్రకటించుచు ఎవనికేని యొకనికి ఉపకారము చేయు
గాక. అంతమాత్రమున నా రాజును ఉపకృతుడైనవాడు శ్లాఘిం
చును. నీవన్ననో గొప్ప కీర్తిశాలివై ప్రజ లందరిని సాధారణ
ముగ రక్షించెడివాడవు గాన హద్దులేని శ్లాఘకు పాత్రుడవని
యర్థము. కావుననే 'పూజనీయః' పూజించతగినవాడు. జన్మము,
తపస్సు, విద్య మున్నగు విశేషములచే ఎవరు నీచే పూజింప
బడుచున్నారో వారిచే శ్రుతి స్మృత్యాదులందు దెలుపబడిన
మార్గమున మోక్షము నపేక్షించుకాలమున భగవంతుడను
బుద్ధిచే నీవు పూజింపదగినవాడవు. రాజు తాత్కాలికమైన ఫల
లాభముకొఱకే అందరిచేతను పూజింపదగినవాడని భావము.
కావుననే "మాన్యః" లోకమర్యాదకొఱకు నీ వెట్లు దండించు
చుంటివో అదియే ధర్మము. ఇతరమైనది కాదు. ఈరీతిగ విద్వాం

సులకును తిరస్కరింపకూడని శాసనముతో కూడినవాడవని భావము. కావుననే 'రాజా' రంజింపజేయుట యను గుణముచే. అర్థముతోగూడిన పదముతో గూడినవాడు. దండధరుడు గుణ దోషములను విమర్శించి, దండము నుపయోగించి, ప్రజలను తనతోగూడ సద్గతిని బొందించునని యర్థము. కనుకనే తన ఆచారముచేతనే జనులందరికి మంచిమార్గము లుపదేశించుటచే గురువు. కాని యెవరికిని శిష్యుడు కాడని యర్థము.

తా॥ 'ఇంద్రస్య' సర్వశక్తులతోగూడిన పరమేశ్వరుని యొక్క, "చతుర్భాగః" పురుషార్థచతుష్టయమును కూర్చునట్టి చతురంశ (నాలుగుభాగముల) సముదాయము ఈలోకమున 'రాజా' రాజగుచు "ప్రజాః రక్షతి" నాలుగు పురుషార్థముల యొక్క మార్గము నొందించుటచే నాల్గుమార్గములచేతను ప్రజలను ప్రవర్తింపజేయుచున్నాడో, 'సః' ఆతడు "లోక నమస్కృతః" సర్వలోకములందు నమస్కరింపబడుచు "వరాన్ భుఙ్క్తే" ఈయుత్తమమైన భోగముల ననుభవించుచున్నాడు. ఎవడు పైనిచెప్పిన నాల్గువిధములైన శక్తులలో ఒక్కొకశక్తితో గూడిననే లోకమునకు రాజై పాలించునో ఆత డీలోకమున సమస్తము ననుభవించినను, "రాజ్యానుభవ మైనపిమ్మట నరకము తప్పదు" అను న్యాయముచే అందరచే నిందితుడై క్రింద బడుచున్నాడని యర్థము.

స 1. శ్లో॥ 20. తే వయం భవతా రక్ష్యా భవద్విషయవాసినః।
నగరస్థో వా వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః॥

వ్యా॥ యా దశా ఇదమిత్థ మిత్యాదినా వక్తు మశక్యా తాదృశకష్టదశా మాపన్నా వయ మన్యోన్యరక్షణబలేన రక్షితు మశక్తాః । భవద్విషయవాసినః- భవతా యత్ర దేశే కంచనకాల ముషిత్వా సతాం రక్షణం కర్తవ్యతయా నిశ్చితం తద్దేశ ఏవ భావ్యరక్షానేన వస్తు మభిలాషిణః భవతా శిష్టపాలన వ్రతేన రక్షితు మర్హాః- శిష్టపాలనధర్మేణ యత్ర దేశే కాలం నేతుం త్వ మైచ్ఛ స్తత్రైవ చిరాత్ప్రభృతి నుష్టైః పీడ్యమానా అపి వాసోఽభిలాషేణ కాలం యాపయంతో వయం త్వద్ర క్షణరూపఫలాభిలాషిణాం సర్వేషామపి రక్షితవ్యా ఇతి సం బంధాతిశయ స్యాత్యాజ్యత్వప్రతిపాదనం- నను భవతామివ మమాపి వనవాసవ్రతవర్తయా కథ మిదానీం రక్షణకాల ఇత్యా హ । 'నగరస్థో వా వనస్థో వా' ఇత్యాదినా । యత స్త్వం జనే శ్వరః । సర్వజంతుసాధారణ్యేన ఈశ్వరః- నియంతా। తదాత్వే త్వం నః రాజా ప్రభు రితి కిము వక్తవ్యం । అతః యథా నగ రే వసతః ప్రజాపాలన మేవ తవ వ్రతం స్వధర్మః తథా వనవా సేఽపి త్వదీయో ధర్మో న త్యాజ్య ఇతి ఫలితం॥

తా॥ 'యాదశా' ఏయవస్థ, ఇట్టిదని చెప్ప శక్యముగాని దో "తాదృశకష్టదశామాపన్నా వయం" అట్టి కష్టదశనొందిన మేము పరస్పరబలముచే రక్షించుకొనుట కసమర్థులమై, "భవ ద్విషయవాసినః" నీచే నేదేశమందుండి, శిష్టులరక్షణము చేయ తగినదని నిశ్చయింపబడినదో, ఆదేశమునందే రాబోమెడి ప్రమో

జనమును దెలిసి నివసించుట కభిలషించెడి మేము, "భవతా" శిష్టపాలనము వ్రతముగాగల నీచే "రక్షితుమర్హాః" రక్షింప తగినవారము. శిష్టపాలనమనెడి ధర్మముతో ఏదేశమందు కాలము గడుపుటకు నీవిచ్ఛయించుచున్నావో, చిరకాలమునుండి దుష్టులచే బాధింపబడినవారమైనను, ఇచ్చట నివసింపవలెనను అభిలాషచే కాలమును గడుపుచున్న మేము నీరక్షణమనే ఫలము నభిలషించెడివారందరకును రక్షింపదగినవారమని, సంబాధాతిశయము విడువతగనిదని కవి ప్రతిపాదించినాడు.

నేనును మీవలె వనవాసవ్రతమం దున్నవాడనే గాన ఇప్పుడు రక్షణకాల మెట్లు అందువేమో? "యతః" ఏకారణమున, "త్వం" నీవు "జనేశ్వరః" సర్వజంతువులకు సాధారణమైన ప్రభువైతివో, అప్పుడు నీవు మాకు ప్రభువని వేఱే చెప్పనేల. కావున పట్టణమందున్నపుడు నీకు ప్రజాపాలన మెట్లు వ్రతమో, (నీకు స్వధర్మమో) అటులనే వనమందున్నను ఆనీ స్వధర్మము విడువతగినది కాదని ఫలితార్థము.

స 1. శ్లో॥ 21. న్యస్తదండా వయం రాజన్ జితక్రోధా జితేంద్రియాః। రక్షితవ్యా స్త్వయా శశ్వ ద్గర్భభూతా స్తపోధనాః॥

వ్యా॥ న్యస్తదండా ఇత్యాది- "య ద్దుష్కరం య ద్దురాప" మిత్యాది ప్రమాణేన తపోబలేన మహతాం భవతాం కి మితి మత్తో రక్షణాపేక్షేత్యత ఆహ । న్యస్తదండా ఇతి- అహింసా వ్రతధరా ఇత్యర్థః జితక్రోధా ఇతి- తజ్జయే హేతుః- జితేంద్రియా ఇతి- ఇంద్రియపుష్టి హేతుభూతాహారాదిపరిత్యాగేన

ఇంద్రియాణి పరిశోష్య తద్బలమూలకేష్ట విఘాతానిష్టాగమాది ప్రయుక్తవిశేషరూపక్రోధనాశః కృత ఇత్యర్థః । అతో వయమివ త్వమ ప్యపేక్షసే యది తవైవ ధర్మవ్యతిక్రమ ఇత్యాహ। "రక్షితవ్యా స్త్వయా శశ్వ ద్గర్భభూతా స్తపోధనా" ఇతి-శశ్వద్గర్భభూతా ఇతి- సర్వథా గర్భస్థజంతురక్షణం మాతు రివ అస్మదాది యావజ్జీవరక్షణ మీశ్వరైకకార్యతయా తవ అపహారిర్యోఽయమిత్యర్థః । నను నైతదహింసావ్రతం । హింసామూలస్య క్రోధస్య తత్ప్రతిబంధకస్య దుస్త్యజత్వాత్ కిం త్వాశక్తిరిత్యత ఆహ- జగత్పాలనధనస్య శ్రుతిసిద్ధస్యాస్మత్పాలనే నాత్మీయధనాభివృద్ధి రేవ భవతీతి- అస్మాకం తు తపోమాత్రధనతయా తద్వృద్ధిప్రతిబంధకధర్మాచరణే తన్నాశే స్వరూపహాని రేవేతి- న ప్రాహుణికహస్తేన సర్పమారణం- నాప్యస్మాక మహింసావ్రతభంగో వేతి భావః । ఇదానీం తవరక్షణమాత్రేణ నాస్మాకం త్వదపేక్షావిరహః- కింతు శశ్వ ద్రక్షణీయా ఇత్య ప్యన్వయః। "శశ్వ ద్గర్భభూతా" ఇతి తత్ర హేతుః। అనేన స్వయం రక్షణావకాశః కదాపి నాస్మాక మితి । మాతు రివ తవైవ రక్షకత్వం చేతి మునితాత్పర్యం సిద్ధం।

తా॥ 'ఏది చేయశక్యముగానిదో, ఏది పొందశక్యముగానిదో అదంతయు తపస్సుచే సాధింపనగును." అను ప్రమాణముచే, తపోబలమున గొప్పవారయిన మీకు నారక్షణ కవసర మేమున్నదందువేమో; 'న్యస్తదండాః' అహింసావ్రతధారులము 'జితక్రోధాః' క్రోధమును జయించినవారము. దీనికి కార

ణాము 'జితేంద్రియాః' జితేంద్రియులమగుటయే. ఇంద్రియముల పుష్టికి హేతువగు ఆహారాదులను విడచుటచే ఇంద్రియములను శోషింపజేసి, ఆ యింద్రియబల మాధారముగా గలిగి సంభవించెడి ఇష్టవిఘాతము (తలచినది కాకుండుట) అనిష్టాగమము (తలవనిది సిద్ధించుట) మున్నగువానివలన గలిగెడు క్రోధము నశింపజేసినవారమని యర్థము. కావున మావలె నీవును ఉపేక్షించినచో నీకే ధర్మవ్యతిక్రమ మగునని చెప్పుచున్నారు. అప్పుడీపాలనము అహింసావ్రతము కానేరదే! హింసామూలమగు క్రోధము పెరుగుటచే దాని ప్రతిబంధకము విడువ శక్యముగాని దగును. ఇక అసమర్థతయే సిద్ధించునందువేమో? "శశ్వద్గర్భభూతాఇతి" తల్లికి గర్భమందలి శిశువు సర్వవిధముల నేరీతిని రక్షింపతగినదో, మావంటివారిని జీవించినంతవరకు రక్షించుట ప్రభుధర్మము గాన నీకు విడుచుటకు వీలులేదని యర్థము. ఇది అహింసావ్రతము కానేరదు. ఏలయన హింసకు మూలమైన క్రోధమును దానికి ప్రతిబంధకమైన అహింసను మేము విడచుటకు వీలులేనిది. కాని అశక్తులము. కావున చెప్పుచున్నారు.

శ్రుతిప్రసిద్ధమైన జగత్పాలన ధనముగాగల నీకు మమ్ముల రక్షించుటచే నీ సంబంధమయిన ధనాభివృద్ధియే యగును. మేము తపోధనులము గాన, ఆవృద్ధికి ప్రతిబంధమును గలుగజేయు ధర్మము నాచరించినపుడు, దానికి నాశము గలిగినపుడు స్వరూపమునకే హాని తటస్థించును. పాములవాని చేతిలో సర్ప

మారణమువలె కాదు. మా అహింసావ్రతమునకు భంగము లేదని భావము. ఇప్పుడు రక్షించినంతమాత్రమున నికముందు నీయపేక్ష మాకు లేకపోదు. కాని యెల్లప్పుడును రక్షింపతగిన వారమనియును అన్వయము చెప్పవచ్చును, 'శశ్వద్గర్భభూతాః' అనునదియే దీనికి హేతువు. కావున స్వయముగా రక్షించుకొనుటకు మాకెప్పుడును అవకాశము లేదని భావము. తల్లి శిశువునకువలె నీవే మాకు రక్షకుడవని (వాల్మీకి) మహర్షి తాత్పర్యము సిద్ధించినది.

స 2. శ్లో॥ 16. త్వాం దృష్ట్వా రాఘవ స్సీతాం విరాధాంకగ
తాం శుభాం। అబ్రవీ ల్లక్ష్మణం వాక్యం ముఖేన పరిశుష్యతా॥
ఇత్యారభ్య

స 2. శ్లో॥ 17. పశ్యసౌమ్య నరేంద్రస్య జనకస్యాత్మ సంభవాం।
మమభార్యాం శుభాచారాం విరాధాంకే ప్రవేశితాం॥

స 2. శ్లో॥ 18. అత్యంతసుఖసంవృద్ధాం రాజపుత్రీం యశస్వినీం।
యదభిప్రేత మస్మాసుప్రియం వరవృతంచ యత్॥

స 2. శ్లో॥ 19. కైకేయ్యాస్తు సుసంవృత్తం క్షిప్రమద్యైవలక్ష్మణ।
యా న తుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ॥

స 2. శ్లో॥ 20. యయాహం సర్వభూతానాం ప్రియఃప్రస్థాపితో
వనం। అద్యేదానీం సకామాసాయా మాతా మమమధ్యమా॥

స 2. శ్లో॥ 21. పరస్పర్శాత్తు వైదేహ్యా నదుఃఖతరమస్తి మే ।
పితుర్వినాశా త్సౌమిత్రే స్వరాజ్యహరణాత్తథా॥

ఇత్యంతసందర్భేణ రామస్య శోకోత్కర్షః కైకే

య్యాం దోషోద్భావనం చ యద్యపి ప్రతీయతే। తథాపి మదీయ ధైర్యాద్యతిశయపరీక్షార్థమై ఉత్తరోత్తరాధిక దుఃఖకల్పనయా మదీయ చిత్తశుద్ధిం ప్రకటయంత్యాః కైకేయ్యా ఈప్సితం సుసంపన్న మిత్యనేన శ్రీరామస్య తాత్పర్య మున్నేయం। పితృవియోగ రాజ్యహరణ వనవాసాద్యపేక్షయా జన్మపోషణ పతిసంరక్షణాదిభి రత్యంతశుద్ధచారిత్రాయా స్సీతాయా స్స్వసన్నిధావపి పరస్పరస్యాతిసంద్యత్వకథనాత్ స్వవిషయే ప్రేమాతిశయద్యోతకమే వేత్యూహ్యం॥

తా॥ "త్వాం దృష్ట్వా రాఘవః సీతాం" అను శ్లోకము మొదలుకొని, "స్వరాజ్యహరణాత్తథా" అనునంతవరకు నుండెడి సందర్భముచే, శ్రీరామునియందు దుఃఖాతిశయము కైకేయియందు దోషారోపణమును తోచుచున్నవి. అయినను నా ధైర్యవిశేషమును పరీక్షించుటకై ఉత్తరోత్తర మధికముగ దుఃఖములను కల్పించుటచే, నా చిత్తశుద్ధిని వ్యక్తముచేయుచున్న కైకేయియొక్క ఈప్సితము బాగుగ సిద్ధించినదని శ్రీరాముని తాత్పర్యమైనట్లు ఊహింపదగినది.

తండ్రితో వియోగము, రాజ్యాపహరణము, వనమందు నివసించుట మున్నగువానికంటె, జన్మపోషణము, పతిసంరక్షణ మున్నగువానిచే మిక్కిలి పరిశుద్ధమైన చరిత్రగల సీతకు తన సన్నిధానమునను పరస్పరము మిక్కిలి సంతోషవిషయమే చెప్పుటచే ప్రేమాతిశయమును సూచించునదియే యని యూహింపతగియున్నది.

స 2. శ్లో॥ 25. రాజ్యకామే మమ క్రోధో భరతే యోఽబభూవ హ।
తం విరాధే విమోక్ష్యామి వజ్రీ వజ్రమివాచలే।

వ్యా॥ భరతే విషయే । రాజ్యకామే- రాజ్యకామప్రకటనే కృతే । తదపి పిత్రా అతిజ్ఞాతే రాజ్యే । కైకేయ్యా స్వపుత్రే భరతే మనోరథే వరద్వయమధ్యే ఏకతరవరత్వేన ప్రకటితే తస్యాం యో మమ క్రోధాతిశయో జాత స్త్వదాజ్ఞయా తదానీం ప్రతిబద్ధ స్తత్ఫలానుభవకాలే త్వదాజ్ఞయైవ పునః ప్రోత్సాహిత ఉపయోక్తు మంతర్నిగూహిత స్తం విరాధే వినియోక్ష్యామీత్యన్వయః । చతుర్దశవత్సర మితమేవ కాలం భరతో రాజ్యం శాస్త్వితి నైతావన్మాత్రం తస్యా హృదయం । కింతు త్వద్వనవాసకామనయా ఏతాదృశ విపదాగమాశయాం తద్భూతయా శాశ్వతికమేవ శాస్త్వితి విజ్ఞాయ త్వదాజ్ఞయా సావకాశః । మంత్రరుద్ధబలో నాగేంద్ర స్తన్నిరోధాపగమాత్పరమివ విరాధే మోక్ష్యామీతి భావః । కైకేయీసంభావితైతాదృశమహావిపన్నిదానభూతవిరాధవధః కైకేయీవధప్రాయ ఏవేతి న మత్కోపో నిరర్థక ఇతి భావః । రామస్య రాజ్యభంగకాలే భరతస్యాసన్నిధానేన కథం తస్య రాజ్యకామత్వమితి తన్మాతృకామ ఏవ భరతస్య రాజ్యకామత్వే తత్సమాధానం పృష్ఠతాడనే దంతభంగ ఇతి న్యాయ మనుకరోతీత్యుపేక్ష్యః। త్వత్స్వామికయో స్సీతారాజ్యయో రనుచితకామవిషయత్వాత్ పూర్వకోపస్యై వాద్య విరాధవిషయకత్వోక్తి రిత్యూహ్యమ్॥

తా॥ 'భరతే' భరతునివిషయమున, "రాజ్యకామే" తండ్రిచే (కైకేయికి) ప్రతిజ్ఞ జేయబడినదగుటచే, రాజ్యమందలి కోరిక ప్రకటింపబడినపుడు కైకేయి తన పుత్రుడగు భరతునకుగా మనోరథమైన వరముల రెండింటిలో నొక వరముగా ప్రకటించినపుడు ఆమెయందు నాకెట్టి కోపాతిశయము కలిగినదో, ఏది నీయాజ్ఞచే నప్పుడు కట్టుపడినదో, దానిఫలము ననుభవించెడికాలమున తిరిగి నీచేతనే ప్రోత్సహింపబడిన దాని నుపయోగించుటకు లోపల వణచుకొంటినో, "తం" ఆకోపమును "విరాధే" విరాధుని విషయమున 'విమోక్ష్యామి' వినియోగించెదనని యన్వయము.

పదునాలుగుసంవత్సరములు పరిమితిగల కాలమును భరతుడు రాజ్యమును పాలించుగాక యని ఇంతమాత్రమే ఆమె అభిప్రాయము గాదు. ఇక నేమందువా ? నీవు వనమందుండవలెనని కోరుట ఇట్టి విపత్తులు తటస్థించునను నూహచే శాశ్వతముగ భరతుడు రాజ్యమును పరిపాలించునని తెలిసియే, ఇప్పుడు నీయాజ్ఞచే అవకాశముతోగూడిన నాకోపమును మంత్రముచే కట్టబడినదగుటచే బలము తగ్గిన సర్పరాజము, ఆమంత్రనిరోధము పోయినతరువాతవలె విరాధునియం దుపయోగించెదను. కైకేయిచే నూహింపబడిన యిట్టి మహావిపత్తులకు కారణమైన విరాధుని వధించుట కైకేయిని వధించుటవంటిదే గాన నాకోపము నిరర్థకము కాదని భావము. రామునకు రాజ్యభం

గము కలుగు సమయమున భరతుడు దగ్గర లేడు గాన ఆతనికి రాజ్యమందు కోరికయుండు టెట్లు? ఆతని తల్లి కట్టి కోరిక యుం డుటచే భరతునకు రాజ్యమునందు కోరిక యుండుట; అను సమాధానము "పృష్ఠమును తన్నగా పళ్ళూడెననుట" యెట్టి దో అట్టిదే గాన ఉపేక్షింపతగినదియే.

స 6. శ్లో॥ 10. త్వా మాసాద్య మహాత్మానం ధర్మజ్ఞం ధర్మ వత్సలం। అర్థిత్వా న్నాథ వక్ష్యామ స్తచ్చనః క్షంతు మర్హసి॥

ఇత్యారభ్య

స 6. శ్లో॥ 11. అధర్మ స్సుమహాన్నాథ భవే త్తస్య తు భూపతేః। యోహరే ద్బలిషడ్భాగం నచరక్షతి పుత్రవత్॥

స 6. శ్లో॥ 12. యుంజానస్స్వానివ ప్రాణా న్ప్రాణైరిష్టాన్సుతానివ। నిత్యయుక్త స్సదారక్ష న్సర్వాన్విషయవాసినః॥

స 6. శ్లో॥ 13. ప్రాప్నోతి శాశ్వతీం రామకీర్తిం స బహువార్షికీం। బ్రహ్మణః స్థానమాసాద్య తత్రచాపి మహీయతే॥

స 6. శ్లో॥ 14. యత్కరోతి పరంధర్మం మునిర్మూలఫలాశనః। తత్రరాజ్ఞశ్చ తుర్భాగః ప్రజాధర్మేణరక్షతః॥

స 6. శ్లో॥ 15. సోయం బ్రాహ్మణభూయిష్ఠో వానప్రస్థగణోమ హాన్। త్వం నాథోనాథవద్రామ రాక్షసై ర్హన్యతే భృశం॥

స 6. శ్లో॥ 16. ఏహి పశ్య శరీరాణి మునీనాం భావితాత్మనాం। హతానాం రాక్షసైర్ఘోరై ర్బహూనాం బహుధా వనే॥

స 6. శ్లో॥ 17. పంపానదీ నివాసానా మనుమందాకినీ మపి। చిత్రకూటాలయానాం చ క్రియతే కదనం మహత్॥

స 6. శ్లో॥ 18. ఏవం వయం నమృష్యామో విప్రకారం తపస్వి
నాం। క్రియమాణం వనే ఘోరం రక్షోభిర్భీమకర్మభిః॥

స 6. శ్లో॥ 19. తతస్త్వాం శరణార్థంచ శరణ్యం సముపస్థితాః।
పరిపాలయ నో రామ వధ్యమానాన్నిశాచరైః॥

స 6. శ్లో॥ 20. పరాత్వత్తో గతి ర్వీర పృథివ్యాం నోపపద్యతే।
పరిపాలయ న స్సర్వా న్రాక్షసేభ్యో నృపాత్మజ॥

ఇత్యంత దశశ్లోక్యా శరణాగతిపూర్వక మాత్మరక్షణం ప్రార్థయతాం మునీనాం "అర్థిత్వే నాధనక్ష్యామ స్తచ్చ నః క్షంతు మర్హసీ" త్యన్వయవ్యతిరేకముఖాభ్యాం రాజ్ఞ శ్శుభాశుభే ప్రదర్శ్యేత। స్మస్మా దపి లోకసాధారణబుధ్యా స్వకార్యసాధనం కిం యుష్మాక మితి రామస్య కోపో భవతీతి తాత్పర్యమ్।

ఇతి శ్రీమద్రామాయణే అరణ్యకాండే హారితస
గోత్రోద్భవేన బొమ్మకంటి నృసింహశాస్త్రిణా
విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం
వ్యాఖ్యాయాం ప్రథమః కిసలయః

---

తా॥ 'త్వామాసాద్య మహాత్మానం'' అను శ్లోకము మొదలుకొని, ఈసర్గయందలి 'పరాత్వత్తోగతిర్వీర' (స. 6. శ్లో॥ 20) అనునంతవరకు నుండెడి పదిశ్లోకములచే శరణాగతులై తమ రక్షణమును గోరెడి మునులకు "ప్రభువా! యాచకులము గాన చెప్పుచున్నాము. మా యీవాక్యములను క్షమించుటకు తగుదువు" అని అన్వయ వ్యతిరేకముఖమున రాజునకు శుభాశుభములు తెలుపబడుచున్నవి. తనకంటెను లోకసామాన్య బుద్ధిచే స్వకార్యములను సాధించుకొనుట మీ కేల యని శ్రీరామునకు కోప ముదయించుచున్నదని తాత్పర్యము.

ఇట్లు శ్రీహరితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు అరణ్య
కాండ ప్రథమ కిసలయము
సంపూర్ణము.

---

స 10. శ్లో॥ 18. అప్యహం జీవితంజహ్యాంత్వాం వా సితే సలక్ష్మ
ణాం। నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్యబ్రాహ్మణేభ్యో విశేషతః॥

వ్యా॥ అప్యహం జీవితమితి- సర్వప్రాణిసాధారణోఽయం శ్రమః- యదాత్మప్రాణవియోగాసహిష్ణుత్వం। బహునాప్రయత్నేన యదర్థం క్లిశ్యంతి ప్రాణినః- తాదృశ మపి జీవితం త్యజేయం- సత్యవసరే కియ దేత త్తతోఽపి దుస్త్యజాం పరిణయకాలే ఽగ్నిసన్నిధౌ జనకేన ప్రతిజ్ఞాపూర్వకం దత్తాం మత్ప్రాణవ్యయేనాపి రక్షితవ్యాం త్వాం చ- నహ్యేతావదేవ "మానా త్ప్రాణో గరీయాంస్తు సర్వప్రాణభృతామపి। మానినాం తు భవే త్ప్రాణస్త్రాణం మానాధిరక్షణా" దితి న్యాయేన జీవితమపి సంత్యజ్య మానరక్షణం। తాదృశ మపి తతోఽపి ధర్మరక్షణం మహాకష్టం। తచ్చాపి మే సుకరం। అస్తు ప్రతిప్రాణాయా స్సత్యాః సమదుఃఖత్వం। కిమేతత్ । సోదరస్య త్యాగ ఇతి త్వత్తోఽపి ప్రియతరతో పిత్రాదినా మదేకసేవార్థమె వనమాగత్య మత్తోఽపి దుఃఖభాగినం లక్ష్మణం వా త్యజామి। అత ఏవ "దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః। తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదర" ఇతి యుద్ధకాండే లక్ష్మణమూర్ఛాదశాయాం శ్రీరామస్యోక్తిః॥

తా॥ తన ప్రాణవియోగమును సహింపకుండుట సమస్తప్రాణులకు సమానమైన ధర్మము. ఏజీవితముకొఱకై ప్రాణులు వివిధప్రయత్నములచే క్లేశము నొందుచున్నవో అట్టి "జీవితమపి జహ్యాం" జీవితము నైనను వదలివైచెదను. సీతా ! సమయము

వచ్చినప్పుడు దీనిని వదలుట యెంతటిది. ప్రాణముకంటెను మి క్కిలి విడువ శక్యముగానట్టియు, వివాహసమయమున అగ్నిసమ క్షమున జనకునిచే ప్రతిజ్ఞాపూర్వకముగ నీయబడినట్టియు నాప్రా ణములు వెచ్చించియు రక్షింపదగిన "త్వాంచ" నిన్నును వద లెదను. ఇంత మాత్రమేగాదు, "సమస్తప్రాణులకు మానము కంటె ప్రాణము గొప్పది. అభిమానవంతులకు మానమును రక్షించుటకై ప్రాణము తృణప్రాయమైనది" అను న్యాయముచే జీవితమును వదలియును మానమును రక్షించుకొనుట యుక్త ము. అంతకంటెను ధర్మరక్షణము మిక్కిలి కష్టసాధ్యము. అది యు నాకు సులభమే. పతియే ప్రాణముగా గల సతికి సమాన మైన దుఃఖము కలుగుగాక. ఈ సోదరుని విడుచుట యేమిటి యందువేమో ? నీకంటె ప్రియమైనవాడు; కావుననే తండ్రి మున్నగువారిచే (ఆమోదింపబడి) నాసేవకై వనమునకు వచ్చి, నాకంటెను అధికముగ దుఃఖము ననుభవించుచున్న లక్ష్మణునై నను వదలివైచెదను. కావుననే యుద్ధకాండమునందు "ప్రతి దేశమందును భార్య లుందురు. ప్రతిదేశమందును బంధువు లుందురు. ఏకోదరుడైన సోదరుడున్న దేశమును మాత్రము జూడనైతిని" అని శ్రీరాముడు దెలిపినాడు.

స 16. శ్లో॥ 27. అస్మింశ్చ పురుషవ్యాఘ్రః కాలే దుఃఖసమన్వితః।
తప శ్చరతి ధర్మాత్మా త్వ ద్భక్త్యా భరతగ పురే॥

స 16. శ్లో॥ 28. త్యక్త్వా రాజ్యం చ మానం చ భోగాం శ్చ వివి ధాన్ బహూన్। తపస్వీ నియతాహార శ్శేతే శీతే మహీతలే॥

స 16. శ్లో॥ 29. సోఽపి వేళా మిమాం నూన మభిషేకార్థ ముద్యతః। వృతః ప్రకృతిభి ర్నిత్యం ప్రయాతి సరయూం నదీం॥

స 16. శ్లో॥ 30. అత్యంతసుఖసంవృద్ధ స్సుకుమార స్సుఖోచితః। కథ న్త్వపరరాత్రేషు సరయూ మవగాహతే॥

వ్యా॥ అస్మిన్ కాలే హేమంతే- దుఃఖసమన్వితః- ఏతత్కాలావచ్ఛిన్న త్వదీయ దుఃఖానుసంధానేన దుఃఖసమన్వితః। త్వద్భక్త్యా ప్రేరిత స్సన్। ధర్మాత్మా- త్వత్సేవారూప ధర్మైకపరస్సన్ తప శ్చరతి- త్వత్ప్రతిజ్ఞాప్రకారేణ కదా త్వద్దర్శనం భవిష్యతీతి నిగృహీతచిత్త స్స న్నిత్యర్థః। తపఃప్రకార మేవాహ। 'త్యక్త్వా రాజ్యం' చేత్యాది 'శేతే శీతే మహీతలే' ఇత్యంతం॥ వేళా మిమాం నూన మిత్యనేన త్వత్సన్నిధానే యథాకాలం తత్తత్కార్యేషు ప్రవర్తతే- తథా త్వదసన్నిధానే ఒపీతి భరతస్య జ్యేష్ఠానువర్తిత్వం స్సూచ్యతే। ఇమాం వేళాం- స్నానకాలం। ప్రకృతిభిః- యథా రాజా తథా త్వదీయదుఃఖ మసహమానై ర్మంత్రిభి రపి। వృతః- ప్రయాతి। త్వదీయస్నానకాలం క్షణ మ ప్యనతిక్రమ్య తదేకనిష్ఠయా స్వతుల్యప్రకృతిభిర్మంత్రిభిః పరివృతో నదీం స్నాతుం ప్రయాతీ త్యనేన భరతస్య జ్యేష్ఠే భక్తివిశేషో వ్యజ్యతే। భరత స్త్వద్భక్తిపారవశ్యేన త్వదీయ ధర్మాచరణే కుతూహలం। ఇదం తు తేజస్తిమిరవత్ తదీయ ప్రకృతదశాకాలకృత్యయో స్సామానాధికరణ్యం న సంఘటత ఇత్యాహ। అత్యంతసుఖేత్యాది। "వికారహేతావపి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరా'' ఇతి న్యాయేన ప్రతిబంధక

సత్త్వేఽపి తజ్జయే నాత్యంత సుకృతప్రవృత్త్యా భరతస్య రామే భక్త్యతిశయానుమితి శ్చ ఇతి భావః । "న సర్వే భ్రాతరస్తాత భవంతి భరతోపమాః" ఇతి యుద్ధకాండస్థ సుగ్రీవమైత్రీ ప్రకర్ష ప్రస్తావే శ్రీరామచంద్రస్య లక్ష్మణాపేక్షయాపి భరతే సోదర గుణాధిక్యప్రసంగ ఇతి తాత్పర్యం । అత్యంత సుఖ అవగాహతే- అపరరాత్రేషు- స్నానకాలేషు । ప్రాత స్స్నానార్హకాలేషు- న కేవల మేవ ద్వి త్రివారం నిత్య మయ మేవ నియమ ఇతి గుహ్య్కారో ఽయ మన్యై ర్నియమ ఇత్యర్థః । ఏతాదృశ మపి కష్ట తరం కర్మ స్వాభావికత్వాదీయభక్తిభరమూలక ఏవేతి భరతస్య భక్త్యతిశయప్రశంసా । సరయూ మవగాహతే। "శీతవాతాతప క్లేశాన్ సహంతే యాన్ పరాశ్రితాః। తదంశే నాపి మేధావీ తప స్తప్త్వా సుఖీ భవేత్ ॥" ఇతి భరతస్య పరమార్థదృష్టి రితి స్తుతిః॥

తా॥ 'అస్మిన్ కాలే' ఈ హేమంతసమయమున "దుఃఖ సమన్వితః" ఈకాలమందు గలిగెడి నీసంబంధమయిన దుఃఖాను సంధానముచే మిక్కిలి దుఃఖముతో గూడినవాడై, "త్వద్భక్త్యా" నీయందలి భక్తిచే ప్రేరితుడై, "ధర్మాత్మా" నీ సేవరూపమయిన ధర్మమందే ముఖ్యతాత్పర్యము గలవాడై, "తపశ్చరతి" నీప్రతిజ్ఞ చొప్పున ఎన్నడు నీదర్శనమగునో యని చిత్తనిగ్రహము గలవాడై తపము నాచరించుచున్నా డని యర్థము. తపస్సు రీతినే దెలుపుచున్నాడు. (రాజ్యమును వదలి, మౌనము నంగీక రించి, వివిధములై విస్తారములయిన భోగములను వీడి, పరిమి

తాహారము గలవాడై, తప మాచరించుచు చల్లని భూమి యందు శయనించుచున్నాడు) నీసమక్షమున ఆయాకాలములకు తగినట్లుగా ఆయాకార్యములం దెట్లు ప్రవర్తించుచుండెనో, అటులనే నీపరోక్షమున నట్లే జరుపుచున్నాడనుటచే భరతుడు జ్యేష్ఠు ననువర్తించుట సూచితమగుచున్నది. 'ఇమాం వేళాం' ఈ స్నానకాలమున, "ప్రకృతిభిః" మంత్రులతో, 'వృతః' కూడినవాడై, 'సరయూం నదీం ప్రయాతి' సరయూనదికి వెడలుచున్నాడు. నీ స్నానకాలమును క్షణమాత్రమును అతిక్రమింపక, తదేకనిష్ఠతో, తనతో తుల్యమగు ప్రకృతులతో గూడి నదికి స్నానమునకు వెడలుచున్నాడు. ఇట్లనుటచే భరతునకు జ్యేష్ఠునియందు భక్తివిశేషము తోచుచున్నది. భరతుడు నీభక్తిపారవశ్యముచే నీధర్మము నాచరించుటయందు కుతూహలము. ఇది చీకటి వెలుగులకువలె ప్రస్తుతదేశకాలకృత్యములకు పొందిక కూడుట లేదనుచున్నాడు. "వికారహేతువు గలిగి నపుడు ఎవరి చిత్తములు వికృతి నందవో వారే ధీరులు" అను న్యాయముచే ప్రతిబంధకము లున్నను వాటిని జయించుటచే, నెల్లపుడు సుకృతమునందే ప్రవృత్తి గలుగుటచే భరతునకు రామునియందు భక్తివిశేష మూహింపబడు చున్నదని భావము. కావుననే 'సమస్తసోదరులు భరతునితో సమానులుగారు.' అని యుద్ధకాండయందలి సుగ్రీవునితో మైత్రిప్రసంగమున శ్రీరాముడు లక్ష్మణునికంటెను భరతునియందు సోదరగుణము లధికముగా నున్నట్లు తెలిపినాడని తాత్పర్యము. "అపర రా

త్రేషు" స్నానకాలములందు. ప్రాతఃకాలమున స్నానము చేయదగిన కాలములందు సరయూనదియందు స్నానము చేయుచున్నాడు. కేవలము రెండుమూడు మారులేగాదు. ఎల్లపుడును గూడ నీ నియమము గలదు. కావున నీ నియమ మితరులచే పాటింప శక్యము గానిది. ఇట్టి మిక్కిలి కష్టతరమైన పనిని గూడ నీ యందుగల స్వాభావిక భక్తివిశేషము చేతనే చేయుచున్నాడు. ఇట్లనుటచే భరతుని భక్తివిశేషమును ప్రశంసించినాడు. 'సరయూమవగాహతే' 'చలి, గాలి, ఎండ మున్నగు వాని వలన గలిగెడి దుఃఖములను పరాస్వరూపము నాశ్రయించి యెవరు సహించెదరో, బుద్ధిమంతుడు డా యంశచేనైన తప మాచరించి సుఖము గలవాడగును.' అని భరతుని పరమార్థ దృష్టిని స్తుతించినాడు.

స 16. శ్లో॥ 33. జిత స్స్వర్గ స్తవ భ్రాత్రా భరతేన మహాత్మనా।
వనస్థమపి తాపస్యే య స్త్వా మనువిధీయతే॥

వ్యా॥ తాపస్యే-తపసివిషయే-త్వామను। త్వదపేక్షయా నైచ్యే విధీయతే- ఆధారో భవతి । కీదృశం త్వాం । "వనస్థమపి" సన్నిధానే తస్మాత్ భీత్యా త్వదవధికనైచ్యానుసంధానేన తప శ్చరతు- తాదృశ హేత్వభావేఽపి త్వత్పరత్వబుద్ధ్యా స్వస్మి న్నీచత్వ మనుసందధాన ఏవ తప శ్చరతి । అతః స్వర్గః। మహాత్మనా- అత్యంతస్థిరచిత్తేన। భ్రాత్రాభరతేన జితః "ఆబ్రహ్మభువనా ల్లోకాన్ పునరావర్తినోఽర్జున। మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే" ఇతి స్మృత్యా శాశ్వతిక మేవ ఫరమపదం ప్రాప్నోతీత్యర్థః । అను- హీనత్వబుద్ధ్యా అనాదృత

ఇతి "హీనే" ఇతి సూత్రేణ అనోః కర్మప్రవచనీయత్వం । "ధీఙ్ ఆధారే" ఇతి దైవాదికాద్ధీధాతోశ్శ్యన్ । యద్వా- వనస్థ మపి త్వా మను- వనస్థేనాపి త్వయా సహ । తాపస్యే- తపః కర్మణి। విధీయతే-శిక్ష్యతే। 'తృతీయార్థే ఇతి' అనోః కర్మప్రవచనీయత్వం । అత్రపక్షే "నదీమన్వవసితా సేనే" త్యాదివత్తృతీయా । తత్ర తృతీయాపదేన తృతీయానిమిత్తం సహ శబ్దః లక్ష్యతే। జ్యేష్ఠో హి మమ భ్రాతా జ్యాయాన్- రామః పిత్రాజ్ఞయా సర్వభోగానపి పరిత్యజ్య నానప్రస్థో ఽభూత్ - కిమాశ్చర్యం మమ పురస్థస్య తపశ్చరణ మితి విజ్ఞాయ త్వత్ప్రీత్యై "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః" ఇతి త్వయా నియుక్త మిత్యర్థః। అతః స్వర్గః జితః-సుఖవిశేషాపేక్షావేశేనాపి భరతస్య నాస్తీ త్యవగమ్యతే । స్వర్గసుఖవిశేషరూపత్వాత్ నిరవధికసుఖాభిలాషిణ స్తవ భ్రాతు ర్భరతస్య నాయం పరిశ్రమ ఇతి తద్విషయే తవ చింతాయా అవసరో నాస్తీతి తాత్పర్యం॥

తా॥ "తాపస్యే" తపస్సువిషయమున నీకంటెను నైచ్యమందు "విధీయతే" ఆధారముగుచున్నాడు. "వనస్థ మపి" నీవు వనమందున్నను, నీసమక్షమున నీయందు భయముచే, నిన్నవధిగాగల నైచ్యము ననుసరించుచు తపస్సుచేయుగాక. అట్టిహేతువు (నీసన్నిధానము) లేకున్నను, నీయందే పరత్వబుద్ధిచే తనయందు నైచ్యమును గూర్చుచునే తపస్సు చేయుచున్నాడు. కావున "స్వర్గః" స్వర్గము, 'మహాత్మనా' మిక్కిలి స్థిరచిత్తముగల "భ్రాత్రా భరతేన" సోదరుడగు భరతునిచే 'జితః'

జయింపబడినది. 'బ్రహ్మలోకమువరకు నుండెడి లోకములు పునరావృత్తిగలవి. ఓఅర్జునా! నన్నును బొందినశైతే తిరిగి జన్మయుండదు' అను స్మృతిచే శాశ్వతమైన పరమపదమును పొందుచున్నాడని యర్థము. 'అను' హీనమనుబుద్ధిచే అనాదరింపబడినది అను నర్థముగల 'హీనే' అను సూత్రముచే "అను" అనుదానికి 'కర్మప్రవచనీయ' మను సంజ్ఞ సిద్ధించినది. 'విధీయతే' అను క్రియాపదము "ధీఙ్" (ఆధారే) అను ధాతువు కంటె "శ్యన్" అను ప్రత్యయము చేయగా సిద్ధించినది. లేదా, "వనస్థమపిత్వామను" వనమందున్నవాడవైన నీతోగూడ. "తాపస్యే" తపస్సు నాచరించుటయందు "విధీయతే" శిక్షింపబడుచున్నాడు. "తృతీయార్థే" అనుసూత్రముచే నీపక్షమున 'అను' అనుదానికి కర్మప్రవచనీయసంజ్ఞా. "నదీమన్వవసితా సేనా" మున్నగువానియందువలె నిచట తృతీయావిభక్తి. ఇచ్చట తృతీయా పదముచే తృతీయావిభక్తికి నిమిత్తమైన సహాశబ్దము లక్షణా వృత్తిచే గ్రహింపబడుచున్నది. నాకు జ్యేష్ఠసోదరుడగు శ్రీరాముడు తండ్రిగారియాజ్ఞచే సమస్తభోగములను విడిచి, వాన ప్రస్థుడాయెను. పట్టణమందుండి నేను తపస్సుచేయుటలో ఆశ్చర్య మేమున్నదని తెలిసికొని, "త్వత్కృత్యే" నీవుచేయు కర్మయందు, "శ్రేష్ఠు డెద్దానిని ఆచరించుచుండునో ఇతరజనుడు దానినే ఆచరించును" అను స్మృతిచొప్పున నీచేతను నియోగింపబడినాడని యర్థము. కావున స్వర్గము జయింపబడినది. సుఖవిశేషాపేక్ష లేశమును భరతునకు లేదని తోచుచున్నది. స్వర్గ

ము సుఖవిశేషరూపముగాన, అవధిలేని సుఖము నభిలషించు నీ సోదరుడగు భరతునకు అట్టిపరిశ్రమ లేదు గాన, ఆతనివిషయమున నీవు చింతింప నవసరము లేదని భావము.

స 18. శ్లో॥ 1. తాంతు శూర్పణఖాం రామః ।
కామపాశావపాశితాం ।
స్వేచ్ఛయా శ్లక్ష్ణయా వాచా ।
స్మితపూర్వ మథా బ్రవీత్ ॥

ఇత్యారభ్య సర్గాంతసందర్భేణ శూర్పణఖాం ప్రతి రామలక్ష్మణయో ర్వాక్యాని పరిహాసగర్భితానీవ భాంతి। సచ పరిహాస స్సలా మనుచితః । తత్రాపి దుర్భగవిషయే సుతరాం । తథాపి నాయం పరిహాసః । కింతు తత్సన్నిధౌ స్వకృత ప్రతిజ్ఞానుసారేణ దుష్టనిగ్రహశాపయుక్తతయా యదృచ్ఛాప్రాప్తశూర్పణఖానిమిత్తకతయా రాక్షసోద్బోధనార్థం పరిహాసాభావః । సీతాబోధిత తన్నిమిత్తక వైరినిరాకరణార్థ స్వాత్మనోర్జితేంద్రియత్వజ్ఞాపనార్థః పరాక్రమాతిశయద్యోతకః కథాప్రసంగః । యది పరిహాస్యమానోఽపి సాజానీయా త్తదా అన్యకృత స్తథా వాదగి పరిహాసస్స్యాత్ । నహీయం రాక్షసీ తాదృశీ । అతఏవ "పరిహాసావిచక్షణే" తి తద్విశేషణం తత్ప్రసంగే । అతో ఽస్యా స్త్రీవ్యక్తిత్వతయా వా మ్లేచ్ఛస్త్రీయా వా అయం రామలక్ష్మణయో రుపక్రమః విరోధోద్బోధకతయా వీరరసాశ్రయ ఏవేతి నిరవద్యం । పరం తు భావికార్యాణా మపరిహార్యతయా తథా తయో రుద్యోగ ఇతి తూష్ణే

యం । అతఏవ। 'క్రూరై రనార్యై సౌమిత్రే పరిహాసః కథం చన । నకార్యః పశ్య వైదేహీం కథంచి త్సౌమ్యజీవతీం' ఇతి వక్ష్యతి । కథంచి దిత్యస్య ఆభాసరూపేణాపీత్యర్థః । యద్యయం పరిహాస స్సభ్యస్స్యాత్ తర్హి ప్రమాదాయైవ। అయం తు సీతాయా జీవితసందేహాకర ఇతి క్రూరసంబంధ స్సర్వథా పరిహార్య ఇత్యార్యణ్యే క్రూరబహిష్కార స్సర్వథా స్మాక మావశ్యక ఇతి సూచ్యతే॥

తా॥ "తాంతు శూర్పణఖాం రామ" అను శ్లోకము నారంభించి సర్గ చివరవరకు నుండెడి సందర్భముచే రామలక్ష్మణులు ప్రసంగించిన వాక్యములు పరిహాసగర్భితములుగ భాసించుచున్నవి. అట్టి పరిహాసము సత్పురుషులైనవారి కనుచితమే. అందును దుష్టమైన విషయమున మిక్కిలి అనుచితము. అయినను ఇది పరిహాసము కాదు. ఇక నేమందురా, ఆమె (సీత) సన్నిధిని తాను (రాముడు) చేసిన ప్రతిజ్ఞ ననుసరించి, దుష్ట నిగ్రహమున కుపయోగించునట్లుగ, తాను కోరకుండగనే వచ్చిన శూర్పణఖను నిమిత్తముగ జేసికొని రాక్షసుల నుద్బోధించుట కయిన పరిహాసాభాసమే యిది. సీతచే బోధింప బడినట్టియు, సీత నిమిత్తముగా గల శత్రునిర్మూలమునకై తాము జితేంద్రియుల మని తెలుపునదియు, పరాక్రమ విశేషమును దెలుపునదియు, నైన కథాప్రసంగమే యిది. పరిహసించినవాడును తెలిసికొన్నదో అప్పు డితరులు చేసెడి పరిహాససంభాషణము పరిహాసమే యగును. ఈరాక్షసి (శూర్పణఖ) యట్టిది గాదు.

కనుకనే ఆసర్గయందు "పరిహాసావిచక్షణా" (పరిహాస మొన ర్చుటలో నేర్పులేనిది) అను విశేషణము గ్రహించినాడు. కావున ఈమె తిర్యగ్జంతుస్వభావము గలదగుటచేతను, మ్లేచ్ఛ స్త్రీ యగుటచేతను రామలక్ష్మణులయొక్క యిట్టి యుపక్రమము, విరోధమును ప్రేరేపించునదగుటచే వీరరసాశ్రయమే యగును. గాన నిందు దోష మేమియును లేదు. మఱియు కాబోవు కార్య ములను పరిహరింప వలనుపడదు గాన వారి కట్టి ప్రయత్నము కలిగెననియు నూహింపతగియున్నది. కావుననే, "లక్ష్మణా! ఆర్యవ్యవహారము లేని క్రూరులతో ఏవిధముగను పరిహాసము చేయజనదు. ఓ సౌమ్యా! ఎట్లో కాలము గడుపుచున్న సీతను చూడుము" అని శ్రీరాముడు చెప్పుచున్నాడు. ఇచ్చట "కథం చిత్" అను పదమునకు 'ఆభాసరూపమునకైనను' అని యర్థము. ఇట్టి పరిహాసము మంచివారితో నైనచో నది ముదావహమే యగును. ఈ పరిహాస మన్ననో సీతకు జీవితసందేహమును గలుగజేయునది. క్రూరులతో సంబంధము సర్వవిధముల పరిహ రింప తగినదియే. కావున నరణ్యమున క్రూరులను సర్వవిధముల బహిష్కరించుట మన కావశ్యక మని సూచించుచున్నాడు.

స 30. శ్లో॥ 22. విహ్వల స్సకృతో బాణైః ఖరో రామేణ సం యుగే। మత్తో రుధిరగంధేన తమే వాభ్యద్రవ ద్ద్రుతం॥

స 30. శ్లో॥ 23. త మాపతంతం సంరబ్ధం కృతాస్త్రో రుధిరా ప్లుతం। అపాసర్ప ద్ప్రతిపదం కించి త్త్వరితవిక్రమః॥

స 30. శ్లో॥ 24. తతః పావకసంకాశం వధాయ సమరే శరం ।
ఖరస్య రామో జగ్రాహ బ్రహ్మదండ మివాపరం॥

స 30. శ్లో॥ 25. సతద్దత్తం మఘవతా సురరాజేన ధీమతా ।
సందధే చ స ధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి॥

వ్యా॥ సంయుగే- ద్వంద్వయుద్ధే- రామస్య ఖరేణ ద్వంద్వయుద్ధే ప్రవర్తమానే । విహ్వలః- వివశః- పూర్వం యథా సకలేంద్రియప్రవృత్తి స్తాదృశవ్యాపారశూన్యోఽపి । కించ-రుధిరగంధేన- స్వస్య చాన్యేషాం చ రుధిరగంధాఘ్రాణేన సురాగంధాఘ్రాణేన సురాపాయీవ। రామ మేవ- న త్వన్యం। అభ్యద్రవత్ - అతివేగేన అభిముఖ మన్వధావత్। ఏతేన ఖరస్య జీవదశాయా మేవ సకలేంద్రియవ్యాపారనిరసనపూర్వకం స్వశక్తి మావేద్యాపి పున స్తస్య సంజ్ఞాపర్యంత మవకాశం ప్రతీక్షమాణస్య శ్రీరామస్య దయాధర్మసంకలిత పరాక్రమాతిశయ శ్చ సూచ్యతే।

వ్యా॥ సంరబ్ధం- అయం మమ శత్రు స్సచ మమ హంతవ్య ఇత్యేతావన్మాత్రాభినివేశయుతః । ఆపతంతం- ఆత్మాభిముఖ మాయాంతం। రుధిరాప్లుతం- స్వబాణనిర్భిన్నసకలమర్మస్థానత్వేన సర్వతో నిస్సర ద్రుధిరధారామాత్రావశేషత్వేన వైరనిర్యాతనాసమర్థం । త్వరితవిక్రమః- ఖరాపేక్షయాపి ద్రుతతరపాదన్యాస్ । అపాసర్పత్ - సమరే శత్రుణా పృష్ఠప్రదర్శనం పలాయనప్రాయతయా శూరగర్హిత మితి బుద్ధ్వా అపాసర్పత్ । పురోభూతఖరగతివేగనిరూపణపూర్వకం ప్రతిపదం

ప్రతికూలపాదన్యాసపూర్వకం. పశ్చా జ్జగామ । కించి దిత్యస్య యావతా కాలేన ఖరగ పున స్సంజ్ఞాం లబ్ధ్వా సమరాయా ఆతిష్ఠత తావత్కాలపర్యంత మిత్యర్థః । యద్వా- యావతి దేశే ఖరస్య పున స్సంజ్ఞాలాభేన యుద్ధాన్ముఖ్యం తావద్దేశ మిత్యర్థో వా- ఏతాదృ శోపసర్పణం ఖరస్య స్వవిషయే అశూరత్వ భ్రాంత్యుత్పాదనార్థ మేవేతి ప్రతీయతే । అన్యథా ఇతగపూర్వ మేవ స్వాధీనాస్త్రో రామః ఖరం హన్యా దేవ । మత్తపలాయి తాజినధరస్య ధర్మవిరుద్ధత్వేన కించి త్కాలపరిత్యా రామస్యేతి హృదయం । అత ఏవ ధర్మాత్మేతి విశేషణం సార్థకం । యత్తు అన్యథానుపపత్తిన్యాయేన ధనురాకర్షణావకాశలాభాయ పశ్చా దపసర్పణ మితి తాత్పర్యాఖ్యానం । తత్తు న సమ్యక్ । 'ఆప త్కాలే నాస్తి మర్యాదే' త్యేత త్తుల్యార్థకాన్యథానుపపత్తిన్యా యవిషయకత్వకల్పనస్య రామే ఒనుచితత్వాత్ । తాదృశార్థ ప్రతీతేః పూర్వోక్త పంచశ్లోక్యంతర్గత తదర్థమూలకతాయా స్వహృదయా నాకలితతయా స్వకపోలకల్పితత్వేన విద్వదనుభవ విరుద్ధత్వాత్ । సర్వాస్త్రకుశలస్య రామస్యాస్త్రప్రయోగాను కూలసందర్భాభావకల్పనే తదీయసర్వోత్కర్ష భంగప్రసంగాచ్చ। "మత్తం పలాయితం భీరు మున్మత్తం శరణాగతం । న హన్యా దానృశంస్యేన ధర్మసేతు రయం సతా" మితి ప్రమాణేన తదీయ చైతన్యస్ఫూర్తిమాత్రాపేక్షైవ రామస్యేతి తత్త్వం । తదీయరక్త గంధ స్యాసహనేన పశ్చా దపసర్పణ మితి తు న । మహాశూ రస్య తథాత్వే సర్వదాపి తద్గంధ స్యాపరిహార్యతయా పశ్చా

దపసర్పణాపత్తేః । కించ రసాన్తరస్య స్వాపేక్షయోత్కృష్టరస భంజకత్వాయోగాచ్చ । తాదాత్వికవీరరసాతిరేకేణో రసాంత రస్య నదీసముద్రన్యాయేన పృథగనవభాసాత్ । యుద్ధే మత్త పలాయితాదివధస్య ధార్మికశూరగర్హితత్వేన రక్తగంధాఘ్రా ణేన అత్యంతమత్తస్య బాణనిర్భిన్నసకలావయవతయా పరవశీ భూతసకలేంద్రియస్య ఖరస్య వధోఽనుచిత ఇతి ఖరాపతనవేగ నిరూపణపూర్వకం పశ్చాదపశ్చా దపసర్పణేన తస్య భ్రాంతి జననేన తుదానివృత్తేః । పరం ద్విపేంద్రస్యేవ పున స్సంజ్ఞా లాభే సమరాభిముఖ్యేన స్థితం తం విజ్ఞాయామోఘాస్త్రప్రయో గేణ హతవా న్రామ ఇతి సముదితోఽర్థః॥

తా॥ "సంయుగే" శ్రీరామునకు ఖరునితో జరిగిన ద్వంద్వయుద్ధము జరుగుచుండగా "విహ్వలః" వివశుడయిన, వెనుక నెట్లు సకలేంద్రియ ప్రవృత్తికలదో, అట్టి పటుత్వముతో గూడిన వ్యాపారము లేనివాడైనను, మఱియు, "రుధిరగంధేన" తనయొక్కయు ఇతరులయొక్కయు రక్తగంధము (పరిమళము) నాఘ్రాణించుటచే "మత్తః" సురా (కల్లు) గంధము నాఘ్రా ణించుటచే కల్లుద్రాగినవానివలె. "రామమేవ" ఇతరుని వదలి శ్రీరామునే "అభ్యద్రవత్" మిక్కిలి వేగముతో పరుగెత్తి వచ్చి మొనరొ్కనెను. ఇట్లనుటచే ఖరుడు జీవించియుండగనే ఆతని ఇంద్రియవ్యాపారములన్నియు నుడుగునట్లు తన భుజశక్తిని ప్రకటించియు, తిరిగి యాతనికి చైతన్యము (తెలివి) వచ్చునంత వరకు సమయమును నిరీక్షించినాడు శ్రీరాముడనుటచే యా

తని ధర్మముతోఁగూడిన పరాక్రమవిశేషము సూచిత మగుచున్నది.

తా॥ "సంరబ్ధం" ఈతడు నాకు శత్రువు. ఈతని నే జంపవలెనను నింతమాత్రముచే పట్టుదలతో గూడినట్టియు, 'ఆపతంతం' తన కెదురుగ వచ్చునట్టియు, 'రుధిరాప్లుతం' తన బాణములచే భేదింపబడిన సకల మర్మస్థానములు గలవాడగుటచే, అంతటను ప్రవహించుచున్న రక్తధారలశేషము కలవాడైనను పగదీర్చికొన నసమర్థుడైన ఖరుని 'త్వరితవిక్రమగ' ఖరుని కంటెను తొందరతోఁగూడిన పాదప్రసారముతో గూడినవాడై, "అపాసర్పత్" యుద్ధమందు శత్రువు పృష్ఠభాగమును జూపుట, వెనుకకు పరుగెత్తుటతో తుల్యమైనది గాన శూరున కిది నింద్యమను బుద్ధిచే, ఎదుటనున్న ఖరుని గతివేగమును నిరూపించుచు ప్రతి యడుగును ప్రతికూలముగ పాదముల నిడుచు వెనుకకు వెడలెను. "కించిత్" యనుటచే ఎంతకాలములో ఖరుడు తిరిగి తెలివి నొంది యుద్ధమునకు సన్నద్ధుడాయెనో అంతకాలము వరకని యర్థము. లేదా, ఎంతప్రదేశములోనున్న ఖరుడు తెలివినొంది తిరిగి యుద్ధమునకు సన్నద్ధుడు కాగలడో అంతట ప్రదేశమునకని యర్థము. ఈలాగున వెనుకకు తగ్గుట ఖరునకు తాను పిరికివాడని భ్రాంతి పుట్టించుటకే యని తోచుచున్నది. లేకున్నచో నింతకు ముందుగనే స్వాధీనమైన అస్త్రముగల శ్రీరాముడు ఖరుని చంపియేవైచును. మత్తిల్లినట్టియు, పరుగెత్తునట్టియు, సంయముడైనట్టియు శత్రువును వధించుట ధర్మవిరుద్ధము గాన శ్రీరా

ముడు కొంచెముకాలము నిరీక్షించినాడని యిందలి హృద యము (నిగూఢాశయము.) కావుననే 'ధర్మాత్మా' అను విశే షణము సార్థకమైనది. కొంద ఱిచ్చట 'అన్యథానుపపత్తి' (వేఱొకరీతిని పొసగకుండుట) న్యాయముచే ధనుస్సు నెక్కుపెట్టుట కవకాశము లభించుటకై వెనుకకు జరిగినాడని తాత్పర్యమును కల్పించినారు. అది న్యాయ్యముగాదు. "ఆపత్కాలే నాస్తి మర్యాదా" (ఆపత్కాలమున మర్యాద యుండదు) అను న్యాయముతో సమానమైన యర్థముగల యీన్యాయమునకు శ్రీరాముడు గురియైనాడని కల్పించుట తగదు. వెనుక చెప్పిన అయిదుశ్లోకములయందు నున్న అర్థము నాధారముగా జేసికొని అట్టి యర్థము స్ఫురించుననుట సహృదయులకు గోచరించునది కాదు గాన, స్వకపోలకల్పితమగుటచే విద్వదనుభవమునకు విరుద్ధమేయగును. సర్వాస్త్రములయందు కుశలుడైన శ్రీరామునకు అస్త్రప్రయోగమునకు అనుకూలమయిన సందర్భము లేదని కల్పించినచో, ఆతని సమస్తమైన యుత్కర్షకు భంగమే వాటిల్లును. 'మత్తెక్కిన వానిని, పరుగెత్తిన వానిని, పిచ్చివానిని, శరణాగతుని, క్రౌర్యముచే వధింపగూడదు. ఇది సత్పురుషులకు ధర్మసేతువు' అను నీప్రమాణముచే ఆతనికి చైతన్యస్ఫూర్తి కలుగునంతవరకు ( తెలివి వచ్చునంతవరకు) ఆ ఖరుని రక్తపువాసన సహింపలేకపోవుటచే వెనుకకు తగ్గినాడనుటను తగదు. అట్లైనచో మహాశూరుని కెల్లపుడును అట్టివాసన పరిహరింప శక్యము కాదు గాన తఱుచుగ వెనుకకు మరలుచుండుటయే తటస్థిం

చును. మఱియు, మఱియొక రసము తనకంటె నుత్కృష్టమైన రసమునకు భంజకము (అణగద్రొక్కునది) అగుటయు తటస్థింపదు. అనగా నాకాలమందలి వీరరసాతిరేకమున బీభత్సాది రసము 'నదీసముద్ర' న్యాయముచే నందు లీనమగును గాని వేఱుగ గన్పట్టుదనుట. యుద్ధమునందు, మత్తుడు, పరుగెత్తువాడు మున్నగువారిని వధించుట ధార్మికుడైన శూరునకు నింద్యము గాన రక్తగంధము నాఘ్రాణించుటచే మిక్కిలి మత్తుడై నట్టియు బాణములచే భేదింపబడి సకలావయవములు గలవాడగుటచే స్మృతి తప్పిన శరీరముగలవాడు నగు ఖరుని జంపుట తగదని, ఖరుని రాకయందలి వేగమును దెలుపుచు, వెనుకకు, ముందుకు, తొలగుటచే ఆతనికి భ్రాంతిని కలుగజేసి, శోకము తగ్గినపిమ్మట గజశ్రేష్ఠమునకు వలె తిరిగి తెలివి వచ్చిన పిమ్మట ఖరుని యుద్ధమునకు అభిముఖుడైన వానినిగా దెలిసికొని, శ్రీరాముడు అమోఘమైన అస్త్రముచే నాతని సంహరించెనని సముదాయార్థము.

స 67. శ్లో॥ 24. రాజ్యభ్రంశో వనే వాస స్సీతా నష్టా ద్విజో హతః। ఈదృశీయం మమాలక్ష్మీ ర్నిర్దహే దపి పావకం॥

స 67. శ్లో॥ 25. సంపూర్ణ మదయ చే ద్యత్ర ప్రత రేయం మహోదధిం। సోఽపి నూనం మమాలక్ష్మ్యా విశుష్యే త్సరితాం పతిః॥

స 67. శ్లో॥ 26. నా స్త్యభాగ్యతరం లోకే మత్తోఽస్మి న్సచరాచరే। యేనేయం మహతీ ప్రాప్తా మయా వ్యసనవాగురా॥

వ్యా॥ ఈదృశవ్యసనేన జీవననివృత్తయే ఽగ్నిప్రవేశో ఽప్యర్థసాధకో న భవతి । మదీయభాగ్యవిపర్యయేణ సోఽప్యగ్ని రేవ దహ్యేతేత్యర్థః । యది తచ్ఛాంతయే సముద్రే మజ్జేయమితిచే త్తదపి న సిధ్యతి । యత స్సోఽపి శుష్యే స్మత్స్పర్శేనేతి మహత్తరకష్టం । ప్రతిజ్ఞా మేవ నిర్వక్ష్యామి యది యేనకేనాపి కారణేన స ర్వే శ్లాఘ్యంతే తదేవాధిక్యం । "న చాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోపకర్షతి । రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః" ఇత్యాదినా రామస్య ధైర్యప్రకర్షాభివర్ణనపరాయోధ్యాకాండస్థ కథాసందర్భేణ న విరోధః । ఏవముత్తరత్ర యత్ర యత్ర రామస్య తత్తత్కథాప్రసంగో వర్ణ్యమానో దుఃఖవిశేషా న ధైర్యలోపప్రసంజక ఇతి జ్ఞేయం । సరితాం పతి రితి- సర్వదా నదీప్రవాహసంబంధేన శోషాయోగ్యత్వేఽపి శుష్యతీతి అలక్ష్మ్యాః ప్రభావాతిశయవర్ణనం । స్వస్య దైవబలాపేక్షయా పౌరుషప్రాబల్యబోధనపర పూర్వోక్తలక్ష్మణవాదఖండనద్వారా అసంభవప్రదర్శన ముఖేన తస్య విశ్వాసదృఢీకరణార్థం రామస్య ప్రసంగః । న తు స్వస్య యథాశ్రుతరీత్యా నీచత్వానుసంధానమాత్రపర ఇత్యున్నేయం॥

ఇతి శ్రీమద్రామాయణే అరణ్యకాండే హారితస
గోత్రోద్భవేన బొమ్మకంటి నృసింహశాస్త్రిణా
విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం
వ్యాఖ్యాయాం ద్వితీయః కిసలయః

---

తా॥ రాజ్యమునుండి భ్రంశము. అరణ్యమందు నివాసము. సీతయు నష్టమైనది. పక్షిరాజు హతుడైనాడు. నా అభాగ్య మిట్లున్నది. దుఃఖనివృత్తికై అగ్నిహోత్రమున బ్రవేశించెద నన్న అగ్నియే దహింపబడు. ఇట్టి దుఃఖసముదయమున జీవితమును విడచుటకై అగ్నియందు ప్రవేశించుటయు ప్రయోజనకారి గాదు. నా భాగ్యవిపర్యయముచే నాయగ్నియే దహింపబడును గాని నన్నాయగ్ని దహింపనేరదని యర్థము. దాని శాంతికై సముద్రమున మునిగెద నన్నచో అదియు సిద్ధింపదు. నే దుముకినచో సముద్రమును నా స్పర్శచే నెండిపోవును. ఇట్లు నాకు గొప్పదగు కష్టము సంభవించియున్నది. నే చేసిన ప్రతిజ్ఞను తెలుపుచున్నాను. ఏకారణముచేనైనను అందరును శ్లాఘింపబడుట యేదికలదో అదియే గొప్పతనము. "రాజ్యము గోల్పోవుట, ఈతని గొప్పదగు లక్ష్మిని కొఱత పడచేయజాలదు. రాజ్యమా? లేక వనవాసమా? అన్నపుడు, వనవాసమే గొప్ప యభివృద్ధికి గారణము." అని అయోధ్యాకాండయందలి రాముని ధైర్యప్రకర్షను వర్ణించెడి కథాసందర్భముతో విరోధము లేదు. ఈరీతిగనే మున్ముం దెచ్చటనైన శ్రీరాముని దుఃఖవిశేషమును తెలుపుచు వర్ణించెడి ప్రసంగము ధైర్యలోపమును గలుగజేయనిదని తెలిసికొనదగినది. 'సరితాం పతిః' అనుటచే ఎల్లపుడు నదుల ప్రవాహముతో గూడియుండుటచే ఎండింపజేయ శక్యము గాకున్నను, ఎండిపోవునని చెప్పుటచే, లక్ష్మియొక్క-

ప్రభావాతిశయము గొప్పదని వ్యక్తమగుచున్నది. తనకు, దైవ బలముకంటె పౌరుషమునకే ప్రాబల్యమును బోధించుచు వెనుక లక్ష్మణునకు చెప్పినవాదమును ఖండించి అసంభవములను ప్రదర్శించుచు, ఆతని విశ్వాసమును దృఢపరుచుటకే రాము డిట్లు ప్రసంగించియున్నాడు. కాని తన్ను నీచునిగా దెలుపుట కిట్లు ప్రసంగించలేదని యూహించుకొనదగును.

ఇట్లు శ్రీహారితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు అరణ్య
కాండ ద్వితీయ కిసలయము
సంపూర్ణము.

---

 

# కిష్కింధాకాండ వ్యాఖ్యా

స 6. శ్లో॥ 24. బ్రూహిసుగ్రీవ కం దేశం హ్రియన్తీలక్షితాత్వయా। రక్షసారౌద్రరూపేణ మమ ప్రాణప్రియా హృతా॥

స 6. శ్లో॥ 25. క్వవా వసతి తద్రక్షో మహద్వ్యసనదం మమ। యన్నిమిత్త మహం సర్వాన్నాశయిష్యామి రాక్షసాన్॥

స 6. శ్లో॥ 26. హరతామైథిలీం యేనమాంచరోష మతాధృవం। ఆత్మనోజీవితాన్తాయ మృత్యుద్వార మపావృతం॥

స 6. శ్లో॥ 27. మమ దయితతమా హృతా వనా।
ద్రజనిచరేణ విమద్య యేన సా।
కథయ మమ రిపుం తమద్య వై।
ప్లవగపతే యమసన్నిధిం నయామి॥

ఇతి కిష్కింధాకాండ షష్ఠసర్గాంతే సుగ్రీవప్రదర్శిత సీతాభూషణదర్శనానంతరం రామేణ సుగ్రీవం ప్రతి సీతాపహారి రాక్షసనివాసాదిప్రశ్నే కృతే తస్యోత్తరరూపం సుగ్రీవః॥

తా॥ ఇట్లు కిష్కింధాకాండయందలి ఆఱవసర్గ చివర సుగ్రీవుడు చూపించిన సీత యాభరణములను జూచి, శ్రీరాముడు సీత నపహరించిన రాక్షసుని నివాసాదికమును గూర్చి ప్రశ్నించెను. ఆసందర్భమున సుగ్రీవు డిట్లు చెప్పుచున్నాడు.

స 7. శ్లో॥ 2. న జానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః। సామర్థ్యం విక్రమం వాపి దౌష్కులే యస్య వా కులం॥

వ్యా॥ యద్య ప్యేత త్సుగ్రీవవచనం వక్ష్యమాణతదీయ వాక్యవిరుద్ధతయా ప్రతిభాతీతి । తద్విరోధపరిహారాయ కేనచి ద్వ్యాఖ్యాతం । వాలివధ మంతరా వానరాణాం సర్వేషా మాత్మవశాభావేన తేషాం స్వనియో గానర్హతయా వాలివధ పూర్వక సామ్రాజ్యసిద్ధిం ప్రాథమికే వాలి మభిప్రేత్య రావణ నిలయా ద్యపరిజ్ఞానకథనం లౌకికోపాయతయా రామాత్స్వ కార్యనిర్వహణపర మితి । త న్నసమ్యక్ । మిత్రద్రోహరూప పాతకస్య తదుద్భావితస్య సుగ్రీవే నిగూహితు మశక్యత్వాత్ "ప్రథమకబళే మక్షికాపాత" ఇతి న్యాయేన అగ్నిసాక్షికస్య మిత్రత్వస్య ప్రథమ మేవ స్వీయాసత్యవచనేన విఘటనాపత్తేః। యది సత్యవ్రతో రామః తదుక్తరీత్యా సుగ్రీవాశయం జానీ యాత్ । కథం విశ్వసేత్ । కథం వా తయో రన్యోన్యమహా కార్యనిర్వహణప్రసంగ ఇత్యాదినా మూలోచ్ఛేదాపత్తేః । కింతు స్వప్రదర్శిత సీతాభూషణకలుషితాంతఃకరణస్య రామ స్య ప్రశ్న మాలోచ్య "శాంతికర్మణి భేతాళోదయ" ఇతి న్యా యేన మయా రామస్య దుఃఖం నివర్తయితుకామేన మహా ననర్థః కృతః । అతో ఽస్య క్రోధోద్యోగః । అన్యథా నిరస నీయ ఇతి పాపకథాప్రసంగ స్సద్భి స్సర్వథా పరిత్యాజ్య ఇతి వస్తుభూత మేవ స్వాశయం సుగ్రీవః ప్రకటీచకార । న జానే ఇత్యనేన- అత ఏవ సర్వథా పాపకర్మణో ఇతి విశేషణం । ఏత దుపష్టంభకతయైవ "సత్యం తే ప్రతిజానామి" (స 7. శ్లో. 2) త్యారభ్య "న త్వం శోచితు మర్హసి" (స. 7. శ్లో. 14) త్యంతేన

సందర్భేణ రావణవధపూర్వక సీతా సమర్పణప్రతిజ్ఞాపూర్వకం శ్రీరామచంద్రస్య శోక మున్మూలయాంచకార సుగ్రీవ ఇతి వేదితవ్యం॥

ఇతి శ్రీ మద్రామాయణే హారితసగోత్రోద్భవేన బొమ్మకంటి
నృసింహశాస్త్రిణా విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం
వ్యాఖ్యాయాం కిష్కింధాకాండ కిసలయః

---

తా॥ ఈ సుగ్రీవవాక్యము తరువాత నాతడు చెప్పబోవు వాక్యమునకు విరుద్ధముగా నున్నట్లు సామాన్యముగ గన్పట్టును. ఆవిరోధమును పరిహరించుటకై ఒకనిచే వ్యాఖ్యానము చేయ బడినది. వాలి చంపబడకున్న వానరులందరు తనకు వశము కా రనియు, వారిని తాను నియమించుట కవకాశము కలుగదనియు తలచి, ముందుగ వాలిని జంపి తనకు సామ్రాజ్యమును సిద్ధింప జేసికొనుటకై రావణుని నివాసాదికము నెరుగననుట లౌకికమైన ఉపాయముగా భావించి రామునివలన తనకార్యమును నిర్వ హింపజేసికొనుటకే సుగ్రీవు డిట్లు పలుకుచున్నాడు అని చెప్ప బడినది. కాని అది సరియైనది కాదు. దానిచే బయలువెడలెడు మిత్రద్రోహరూపమైన పాపము కప్పిపుచ్చుటకు శక్యముకాదు గాన "మొదటి ముద్దలోనే మక్షికము పడెను" అను న్యాయము చొప్పున అగ్నిసాక్షిగ జరిగిన స్నేహమునకు ముందుగనే తన యసత్యవచనముచే భంగము వాటిల్లును. శ్రీరాముడు సత్య వ్రతుడే యగుచో ఆతడు చెప్పిన రీతిగ సుగ్రీవుని యభిప్రాయ

మును గుర్తెరిగియుండును. అప్పుడు ఆతనిని నమ్ముటెట్లు? వారికి పరస్పరము గొప్పదగుకార్యమును నిర్వహించుటకు సంభాషణ జరుగుటెట్లు? ఈమొదలగు అనుపపత్తులచే మూలమునకే భంగము వాటిల్లును. మఱియు, తనచే ప్రదర్శింపబడిన సీతాభూషణముల జూచి కలుషితమైన అంతఃకరణముగల శ్రీరాముని ప్రశ్న నాలోచించి "శాంతికర్మణియుండు భేతాళోత్పత్తి" అను న్యాయముచే దుఃఖము పోగొట్టవలెనను కోరిక గల నాచే గొప్ప అనర్థము చేయబడినది. కావున నీతనికి క్రోధప్రయత్నము మఱియొకరీతిని పోగొట్టవలెను. సత్పురుషులతో అసత్కథాప్రసంగము సర్వవిధముల పరిహరింపవలెను. ఇట్లూహించి యథార్థమైన తన యభిప్రాయమునే సుగ్రీవుడు వ్యక్తముచేసెను. "నజానే" అని. కావుననే "సర్వథా పాపరక్షసః" అను విశేషణమును గూర్చినాడు. దీనిని సమర్థించుటకే 'సత్యంతే ప్రతిజానామి" (స 7. శ్లో. 2) (నీకు యథార్థమును దెలుపుచున్నాను) అనునది మొదలు 'నత్వాం శోచితుమర్హసి' (స 7. శ్లో. 14) (నీవు దుఃఖింపతగవు) అనునంతవరకు నుండెడి సందర్భముచే, రావణుని వధించి, సీతను నీకిచ్చెదనని ప్రతిజ్ఞ చేయుచు సుగ్రీవుడు శ్రీరాముని దుఃఖమును పోగొట్టెనని తెలియదగినది.

ఇట్లు శ్రీహారితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు కిష్కింధా
కాండ కిసలయము.

# సుందరకాండ వ్యాఖ్యా



శ్లో॥ నత్వా శ్రీగురుపాదాబ్జం ధ్యాత్వా దేవీం చ చిన్మయీం।
వ్యాఖ్యాం సుందరకాండస్య కుర్వే వల్మీకనిర్మితేః॥

తా॥ శ్రీగురువర్యుల పాదాబ్జమును ధ్యానముచేసి చిత్స్వరూపిణియగు శ్రీదేవిని నమస్కరించి, వాల్మీకిమహర్షి రచియించిన సుందరకాండమునకు వ్యాఖ్య నొనరించుచున్నాడను.

స 1. శ్లో॥ 1. తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః।
ఇయేష పద మన్వేష్టుం చారణా చరితే పథి॥

వ్యా॥ తతః- మానసికలంకా ప్రవేశానాంతరం। రావణనీతాయాః- దురాపాయా ఇత్యర్థః।, సీతాయాః శత్రుకర్శనః- సీతాసబంధినః రావణాద్యా యే శత్రవ స్తజ్జయోత్సాహః। చారణా చరితే- చారణపద ముపలక్షణం- దేవాదీనా మపి దుష్ప్రవేశే। పథి- మార్గే। పదం- స్థానం। అర్థా త్సీతాయా ఇత్యేవ సన్నిధానా ల్లభ్యతే। అన్వేష్టుం-మార్గితుం। ఇయేష- ఐచ్ఛత్। ఉత్సాహశక్తేః కార్యసాధకత్వా దాదౌ లంకాప్రవేశే ఉత్సహమాన శ్చతుర్దశలోకకంటకరావణగుప్తాయా స్సీతాయాః మార్గణం దేవాదీనా మపి సంచరణాసాధ్యే తస్య ధ్యాన ఏవ కార్యం। తతశ్చ "ప్రధానమల్లనిబర్హణ" న్యాయేన తదీయప్రధానరాక్షసనాశశ్చ భవిష్యతీతి నిశ్చైషీ దితి శా

వ్యార్థసూచనం పర్యవసన్నం । అంతఃకరణప్రవృత్తి రేవ కార్య సిద్ధే ర్మూల మితి లంకాయా మస్య మనఃప్రవృత్తి ముక్త్వా న్మహర్షి రితి వ్యజ్యతే । ఏవమేవ ఉత్తరత్ర సీతాసకాశా దభిజ్ఞానాయ తద్దత్తం మణి మాదాయ తత్రైవ రయేన గతో రామం శరీరేషు నిక్షిత ఇతి వక్ష్యతే । లంకాయాం ప్రవేశ ఇవ తతో నిర్గమస్యాపి అనన్యసాధ్యత్వా దిత్యూహ్యం॥

తా॥ 'తతః' మానసికముగ లంకను ప్రవేశించిన పిమ్మట "రావణసీతాయాః" పొంద శక్యముగాని యని యర్థము. 'సీతాయాః శత్రుకర్శనః' సీతా సంబంధమయిన శత్రువులు రావణాదు లెవరు గలరో వారిని జయించు నుత్సాహము, "చారణాచరితే" చారణపదము ఇతరమైన దేవతల కుపలక్షణము. దేవతలకును ప్రవేశింప శక్యముగాని "పథి" మార్గమందు "పదం" స్థానమును. సీతయొక్క స్థానమని అర్థము. "సీతాయాః" అను పదము 'పద' అను పదసాన్నిధ్యమువలన లభించును. 'అన్వేష్టుం' వెదుకుటకు 'ఇయేష' ఇచ్ఛయించెను. ఉత్సాహశక్తి కార్యసాధకము గాన, ముందుగ లంకయందు ప్రవేశింపబోవునపుడు ఉత్సాహముతో గూడినవాడై పదునాలుగు లోకములకు, కంటకుడైన రావణునిచే రక్షింపబడిన సీతను వెదకుట దేవతలకును సంచరించుటకు శక్యముగాని ఆ రావణుని ఉద్యానమునందే చేయవలెను. దానివలన"ప్రధానమల్లనిబర్హణ" న్యాయముచే ఆతనికి ప్రధానులగు రాక్షసుల నాశనమునగునని నిశ్చయించెనని కావ్యార్థమును సూచించినాడని తేలినది. సత్పురుషుల యంతఃకరణప్రవృ

త్తియే (మనోనిశ్చయమే) కార్యసిద్ధికి మూలము గాన ఈతని మనస్సు లంకయందు తగుల్కొనినదని మహర్షి సూచించినాడు. ఇటులనే మున్ముందు సీత సమీపమునుండి, ఆనవాలుకై ఆమె యిచ్చిన మణిని దీసికొని అచ్చటనుండియే వేగముతో శ్రీరాముని బొందెను. శరీరమాత్రముచే నచట నుండెనని చెప్పబోవుచున్నాడు. లంకయందు ప్రవేశించుట యెంతటి కష్టసాధ్యమో అచ్చటనుండి మరలుటయు నంతటి కష్టసాధ్యమైనదియే యని యూహింపనగును.

స 21. శ్లో॥ 23. వర్జయే ద్వజ్ర ముత్సృష్టం వర్జయే దంతక శ్చిరం । త్వద్విధం నతు సంక్రుద్ధో లోకనాథ స్స రాఘవః॥

వ్యా॥ ఇంద్రేణ ఉత్సృష్టం- అత్రౌచిత్యా దింద్రస్యైవ కర్తృత్వ మితి ఇంద్రేణే త్యధ్యాహార్యం । స్వశక్తి మంత్రశక్తి పూర్వకం శత్రువధాయ ప్రయత్నప్రకర్షేణ విసృష్టం వజ్రం యేన కేనచి త్కారణేన నిరుద్ధశక్తికం సత్ లక్ష్యం త్యజేత్- లక్ష్యా దపేయాత్ - యథా హనుమదాది । అంతకః- సర్వసంహారకతయా భగవతా నియుక్తః మహాపురుషః । చిరం- చరమావధితయా దైవనిర్ణీతకాలా త్పరం- త్యజే దితి సంబధ్యతే । మహాత్మాన మితి శేషః- యథా మార్కండేయాదికం । లోకనాథః- అనన్యనియమ్యశాసనః । రాఘవః- జన్మస్థానబలే నావంధ్యపరాక్రమతయా ప్రసిద్ధః । త్వ ద్విధం తు- అవశ్యదండనీయదోషయుతం తు । న వర్జయేత్ - దురతిక్రమతయా సర్వలోకవిదితాభ్యాం వజ్రాంతకాభ్యా మపి స్వతపోబలేన యః

కశ్చి ద్వివిముచ్యేత- సంపాదితాసార శ్చేత్ । త్వం త్వ త్యాజ్య దోషో రాఘవ శ్చ సర్వలోకప్రభుత్వా దనన్యనివ ర్త్యశాసన ఇతీయం తే దుస్థితి శ్శరణాగతిమాత్రసాధ్యై వేతి భావః॥

తా॥ 'ఇంద్రేణ ఉత్సృష్టం' ఇచ్చట వజ్రాయుధమును ప్రయోగించుటకు ఔచిత్యమునుబట్టి ఇంద్రుడే కర్తయగును గాన "ఇంద్రేణ" అనుపదము తెచ్చుకొనదగినది. స్వశక్తి మంత్ర శక్తులను పురస్కరించుకొని శత్రువధకై విశేషప్రయత్నముచే నింద్రునిచే "ఉత్సృష్టం వజ్రం" ప్రయోగింపబడిన వజ్రాయుధ మును "వర్జయేత్" ఏదియేని యొకకారణముచే నిరోధింపబడి శక్తికలదై లక్ష్యమును విడుచుగాక. హనుమంతుని విషయమున ప్రయోగించిన తత్తినివలె. "అంతకః" అందరకు సంహారకుడుగ భగవంతునిచే నియమింపబడిన మహాపురుషుడు "చిరం" ఆఖరి యవధిగ దైవముచే నిర్ణయింపబడిన కాలమునకు తరువాత "త్యజేత్" మహాత్ముడగు నొకానొకరిని విడిచిన విడుచుగాక. (మార్కండేయుని విడిచినరీతిని) "లోకనాథగ" ఇతరులచే నియ మింపబడు శాసనమునకు సాధ్యముగాని "రాఘవః" జన్మస్థాన బలములచే సఫలమైన పరాక్రమముగలవాడని ప్రసిద్ధికెక్కిన శ్రీరాముడు "త్వద్విధం తు" తప్పక శిక్షింపదగిన దోషము గల నీవంటివానిని 'న వర్జయేత్' విడిచిపెట్టడు. అతిక్రమింప శక్యము గానిదని ప్రసిద్ధినందిన వజ్రాయుధముల బారినుండి, తపోబల ముచే సంపాదింపబడిన సారముగలవా డెవడేని యొక్కడు విడువబడుగాక. నీవన్ననో విడువతగనట్టి దోషము గలవాడవు.

రాఘవుఁడును సర్వలోకప్రభువుగాన అనివార్యమైనశిక్షగలవాఁడు. ఇట్టి నీదుస్థితి ఆతని శరణుబొందిననే చక్కఁబడునని భావము.

స 21. శ్లో॥ 32. తస్య తే విగ్రహే తాభ్యాం యుగగ్రహణ
మస్థిరం।వృత్రస్యేవేంద్రబాహుభ్యాం బాహోరేకస్య విగ్రహే॥

వ్యా॥ తస్య- తాదృశపరాక్రమస్య రామస్య.। తే విగ్రహే- విరోధే ప్రాప్తే। యువయో రుభయో స్సమరే సిద్ధే। తాభ్యాం- రామలక్ష్మణాభ్యాం। యుగగ్రహణం- సమక్షతయావస్థాన మితి యావత్। యథా లోకే యుగం భారవహనయోగ్యం శకటమధ్యగతం దారువిశేషం సమబలా దేవ వృషభౌ వహతః తథా తత్సమశక్తికతయా త్వ మవస్థాతుం న శక్నోషీతి భావః। అస్థిర మిత్యనేన కంచనకాల మవస్థాయాపి పశ్చా త్తద్బలాతిశయేన మృద్యమాన స్స న్నాలంభవసీతి ద్యోత్యతే। యథా పురా వృత్రస్య వజ్రేణ నికృత్తైకబాహో రపి పరాక్రమేణ ఏకే నైవ బాహునా యుద్ధాయోద్యత స్సమితిపీడాయా శ్శరణాగతి స్సర్వథా యోగ్యేతి ద్వషంత మపి రావణం బోధయంత్యా స్సుమనస్కత్వం ప్రతీయతే। యద్వా- బాహుద్వయేనాపి యోద్ధు మీహాస్యైకే నైవ బాహునా తదర్హస్య వృత్రస్యేవ బాహో రితి నాయోజ్యం। ప్రకరణ మేతద్విధాన్వయేమానం చోరవృత్త్యా ప్రవృత్తస్య తవ భ్రాతృభ్యా ముభాభ్యా మపి సంమర్దో న్యాయ్య ఇతి సీతాహృదయం। అథవా పర్యాయేణవా తాభ్యాం విగ్రహే సమబలత్వాత్తయో స్సమానవీరత్వం నఘటత ఇతి భావః॥

తా॥ "తస్య" అట్టి పరాక్రమము గలిగిన శ్రీరాము నకు "తే" నీకును "విగ్రహే" విరోధము ప్రాప్తమైనపుడు. మీ యిద్దరకు సమరము సిద్ధమైనపుడని యర్థము. 'తాభ్యాం' ఆ రామలక్ష్మణులతో "యుగగ్రహణం" ఎదిరి నిలుచుట, ఏరీ తిగ త్రైలోక్యమున భారమును వహించుటకు తగిన శకటమధ్యమున నున్న కాడిని సమబలముగల వృషభములు (ఎద్దులు) మోయు నో ఆరీతిగ ఆతనితో సమానమయిన శక్తిగలవాడవై నీవుండు టకు సమర్థుడవు కానేరవని భావము. 'అస్థిరం' అనుటచే కొంతకాల మెదురుగ నిలిచియు, తరువాత నాతని బలవిశేషము చే పీడింపబడినవాడవై ఎదురొకొనుటకు తగవని ద్యోతిత మగు చున్నది. ఏరీతిగ పూర్వము వజ్రముచే భేదింపబడిన ఒక్క బాహువుగల వృత్రాసురుడు ఒకేబాహువుచే యుద్ధమున కుద్యుక్తుడాయెనో, అటులనే యుద్ధమునకు సన్నద్ధుడవై శీఘ్ర నొందుటకుపూర్వమే శరణాగతుడవగుట సర్వవిధముల యో గ్యము. ఈరీతిని శత్రువైన రావణునిగూర్చి బోధించిన దన్నచో సీతయొక్క సౌమనస్యము మిక్కిలి ప్రకటిత మగు చున్నది. లేదా, రెండుబాహువులచేతను యుద్ధముచేయుట కొరకు కోరిక గలిగినట్టియు, ఒక్కబాహువుచేతనే యుద్ధము చేయగల్గినట్టివాడైన వృత్రుని బాహువు యెక్కువలెనని కూర్చు కొనదగినది. ఇచ్చటి సందర్భమే యీరెండురీతుల నన్వయించుట లో ప్రమాణము. చోరునిరీతిని ప్రవర్తించిన నీకు ఇద్దఱు సోద రులవలన ఒత్తిడి న్యాయమని సీత యభిప్రాయము. లేదా,

క్రమముగ వారిద్దరితో విరోధముగల్గినపుడు వారిద్దరు సమాన మైన బలముగలవారు గాన వారికెదుట నిలువగలిగిన వీరుడ వగుట పొసగనేరదని భావము.

స 48. శ్లో॥ 11. న వీరసేనా గణశోచ్యవంతి ।
న వజ్రమాదాయ విశాలసారం ।
న మారుతస్యాస్య గతేఃప్రమాణం ।
న చాగ్నికల్పః కరణేన హంతుం॥

వ్యా॥ వీరసేనాః గణశోచి-ఇదం భూతం నావంతి-నహిం సంతి-సూ. "అవరక్షణగతికాంతిప్రీతి తృప్త్యవగమప్రవేశ శ్రవణ స్వామ్యర్థయాచన క్రియేచ్ఛా దీప్త్యవాప్త్యాలింగన హింసాదాన భాగవృద్ధిషు" ఇతి ధాతుపాఠే ఏకప్రహారేణైవ గణశో యాధశ శ్శత్రూ న్నాశయే దిదం మాహాభూత మిదం సేనాసన్నివేశేన బహువీరా అపి మిళిత్వా హింసితుం నాలంభవతీత్యర్థః । అత ఏవ ఇదమిత్థ మితి నిర్దేష్టు మశక్యత్వా త్సామాన్యతో నపుంసక ప్రయోగ ఇతి జ్ఞేయం । వజ్రమాదాయ- వజ్రస్య- వజ్రాయు ధస్య- మా (లక్ష్మీః) శక్తిరిత్యర్థః- తాం ద్యతి- ఖండయతీతి- తస్మై । విశాలసారం- అధికబలం ఆయుధం। న-నాస్తి । వజ్రం స్వస్మి న్నింద్రేణ ప్రయుక్తం మోఘీకృతవంత మేనం హంతు మన్యదధికసారం నాస్తీతి- "క్రియార్థోపపదస్యే"తి చతుర్థీ । న మారుతస్యేతి- మారుతస్య మరుత్సంబాధినః అస్య । గతేః ప్రమాణం-ఇయత్తాపరిచ్ఛేదః నచాస్తి। నచాగ్నీతి- అగ్నికల్పః- అగ్నిం కల్పయతీత్యగ్నికల్పః- కరణేన ఆగ్నేయాద్యస్త్రేణాపి

న హంతుం శక్య ఇత్యర్థః । అనేన వాక్యత్రయేణాజయ్యపరాక్రమస్య స్వపుత్ర స్యాక్షకుమారస్య విచిత్రవధప్రశంసాద్వారా వికలయతీతి। ఆయుధబలస్య గగనస్యోపరిభ్రమంతం వాయుసుతం కోపావేశేన ఉపరి నిపత్య హంతు ముద్యతో౽పి తేనాభిఘాతాచ్చరణాగ్రాహం గృహీత్వా స్వపుత్రం మారయతో౽స్య మహాప్రభావం దశాననో జ్ఞాత్వా బ్రహ్మాస్త్ర మింద్రజితం స్మారయామాసేతి ద్యోత్యతే। బ్రహ్మాస్త్ర మంతరా నాన్యదస్య నిగ్రహోపాయ ఇతీంద్రజితం స్మారయామాస రావణో మంత్రగోప్తేతి జ్ఞేయం॥

తా॥ "వీరసేనాః" వీరులైన సైనికులు, "గణశోచి" గుంపు గుంపులుగ హింసించు (ఇదం భూతం) ఈభూతమును "నావంతి" హింసింపరు. "అవరక్షణ- వృద్ధిషు" అను ధాతుపాఠము ననుసరించి హింసార్థము చెప్పబడినది. ఒక్క ప్రహారమాత్రముననే గుంపుగుంపులుగ శత్రువులను నశింపజేయుచున్న యీభూతమును సేనాసన్నివేశమున అనేకవీరులు ఒకచో గుమిగూడియు, హింసింప సమర్థులు గాకున్నారని యర్థము. కనుకనే ఇదమిత్థమని చెప్ప శక్యము గాకుండుటను బట్టి సామాన్యముగ గణశోచి అను పదము నపుంసక ప్రయోగమని తెలిసికొనదగినది. "వజ్రమాదాయ" "వజ్రస్య" వజ్రాయుధముయొక్క "మా" (లక్ష్మి) శక్తియని యర్థము. "తాంద్యతి" దానిని ఖండించునట్టి. 'తస్మై' యాతనికై "విశాలసారం" అధికమైన బలముగల ఆయుధము "న" లేదు. ఇంద్రునిచేత నీవి

షయమున ప్రయోగింపబడిన వజ్రాయుధమును విఫలముజేసిన యీతని హింసించుకొరకు (వజ్రాయుధముకంటె) ఇతరమగు అధికసారముగల ఆయుధములేదని భావము. ఇచ్చట 'క్రియార్థో' ఇత్యాది సూత్రముచే చతుర్థీవిభక్తి యని తెలియనగును. 'మారుతస్య' వాయువు సంబంధమయిన, "అస్య" ఈతనియొక్క "గతేఃప్రమాణం" గమనమునకు పరిమితి "న" లేదు. "అగ్ని కల్పః" అగ్నిని కల్పించునట్టి యీతడు 'కరణేన' ఆగ్నేయాది దివ్యాస్త్రములచే "హంతుంన" హింసించుటకు సమర్థుడు గాడని యర్థము. ఈపై మూడువాక్యములచేతను జయింప శక్యముగాని పరాక్రమముగల ఆంజనేయునియొక్క పరాక్రమమును, తన పుత్రుడయిన అక్షయకుమారుని విచిత్రవధమూలముగ నెఱిగి ప్రశంసించుచు, రావణుడు వ్యాకులపడుచున్నాడు. ఆయుధబల మున కందక ఆకాశముమీద సంచరించు ఆంజనేయుని కోపావేశమున ఆకాశమున కెగిరి చంపుటకు యత్నించినను, ఆతనిచే దెబ్బతినియు కాళ్ళు పట్టుగా పట్టుకొని తన పుత్రుని చంపుచున్న ఆంజనేయుని గొప్పప్రభావమును రావణుడు తెలిసికొని, ఇంద్ర జిత్తునకు బ్రహ్మాస్త్రమును స్మరణకు దెచ్చెనని ద్యోతితమగు చున్నది. బ్రహ్మాస్త్రము ప్రయోగించుటతప్ప, వేఱొక సంహారోపాయము లేదని, మంత్రరక్షకుడైన రావణుడు ఇంద్రజిత్తు నకు బ్రహ్మాస్త్రమును స్మరణకు దెచ్చెనని తెలియనగును.

స 51. శ్లో॥ 27. న తు ధర్మోపసంహార మధర్మఫలసంహితం ।
తదేవ ఫల మన్వేతి ధర్మ శ్చాధర్మనాశనః॥

వ్యా॥ నను మహతా పౌరుషేణ ప్రారబ్ధ మపి నివర్త యామి । యథా సావిత్ర్యాది రిత్యాశంక్యాహ- నత్వితి । ధర్మోపసంహారం- ఉపసంహ్రియంతే- ఉపసంగృహ్యంతే అనే నేతి- 'కరణే ఘఞ్'। ఉపసంహ్రియంతే- స్వాయత్తీక్రియంతే ఆత్మేతి- అధికరణే "బాహులకాత్ ఘఞ్"- ధర్మాణా మితిషష్ఠీ సమాసః । సుకృతాతిశయసాధనం-తచ్చ "అర్థా త్తపో హోమ పూజా" తం తు న కరిష్యసి । తత్ర హేతుః - అధర్మఫలసంహిత మితి- "సమో వా హితతయో" రితి మలోపః । బలవత్తరా ధర్మరూపాభిఘాతా న్నదీవేగా త్సికతాసేతు రివ దురవస్థానం తే మన స్తత్రేతి భావః । నను పూర్వసంచితధర్మబలాదేవ పాపనాశో భవిష్యతి- కి మిదానీం క్లేశే నేతి చే త్తత్రోత్తర మాహ- తదేవేతి । అధర్మనాశన శ్చ- 'ధర్మేణ పాప మపను దతీ'తి । అధర్మనాశహేతు రపి ధర్మః పూర్వసంపాదిత స్సు కృతవిశేషః- తదేవ- తావదేవ। ఫలం- సుఖం। అన్వేతి- అను బధ్నాతి ! యావత స్సుకృతస్య యావత్ఫలదానే శక్తి స్తావదేవ ఫల మీష్టే దాతుం న త్వధిక మల్పం వా- అన్యథా స్వల్పే నైవ సుకృతేన మహాఫలసిద్ధౌ లౌకికే వా ఆముష్మికే వా ఫలే కశ్శ్రమం కుర్యాత్ । అత స్తదభిప్రాయస్తే నసాధు రితి భావః । నన్వేత ముత్తరశ్లోకే 'క్షిప్రమేవ ప్రపత్స్యసే' ఇత్యేత దంతేన సందర్భేణ ధర్మఫలస్య అచిరభావిత్వోక్త్యా చికీర్షితస్య తపసః కీదృశ స్సంబంధో ఘటిత ఇతి చే చ్ఛృణు । తపో హి చిత్తవృత్తినిరోధః- సచ చిత్తవిక్షేపే న సంభవతి । త్వదీయ

ప్రారబ్ధఫలభూతక్లేశవిశేషరూప ప్రతిబంధకాధికరణచిత్తే తన్ని
రోధమంతరా తాదృశవృత్తేరనుదయా త్తేజస్తిమిరయో రివ
వైయధికరణ్య మితి తాత్పర్యం । దోషాతనతిమిరస్యాగామి
ప్రాభాతికతేజఃప్రతిబంధవత్తస్యాచిరభావిత్వే మదీయాంశాపజ
యపీడాదర్శనత్వదీయక్రీడాభంగాత్థాదివినాశాదిక మేవ నిదర్శన
మితి భావః । న సంభవతి- చిత్తవిక్షేపస్య తన్నిరోధవిరోధి
త్వాత్- యద్యల్పకాలావచ్ఛిన్నతపస్స్యా త్తదా న మహాఫలం
మానుపాద్యపాదానక మవధ్యత్వ రూపం ఫలం దాతు మీష్టే।
కింతు బహువర్షసాధ్యమేవ తాదృశమహాఫలాయ శక్నుయాత్।
అతః పంచమదినేష్వేవభోగాయారబ్ధః అధర్మః చిత్తం విక్షిపే
దేవ । తస్మా దల్పీయసీ వర్తికా దీపితాపి గాఢాంధకారమివ
మహాంతం త్వదీయం ప్రారబ్ధావస్థాపన్న మధర్మం నిరోద్ధు
మశక్నువ త్ప్రత్యుత స్వాశ్రయదౌర్బల్యసంపాదన ద్వారా
స్వయ మేవ నశ్యతీతి భావః॥

యద్వా- నను 'జాతస్య హి ధ్రువో మృత్యు' రితి ప్ర
మాణేన ప్రత్యక్షేణ చ జనిమతో మృత్యో రవశ్యభావిత్వనిశ్చ
యేన తద్విషయే న మే కాచి చ్చింతా । కింత్వితఃపర మపి
చిరాయ ధర్మఫలానుభవే భవిష్యతి యేన కేనాపి నిమిత్తేన
దేహభంగః కిమిత్యద్యబిభీషి కేత్యత ఆహ-నత్వితి। అధర్మఫలస్య
సంహితా- అత్యంతసంశ్లేషః యస్య తం ధర్మోపసంహారం ।
ఉపసంహృతం ధర్మం స్వీయయావత్ఫలదానేన క్షీణప్రాయం
తత్ఫలం సుఖం నాన్వేత్యేవ- నానుబధ్నాత్యేవ । యావ

తేన్స్నహక్షయేన దీపప్రకాశ ఇవ యావత్ఫలదానేన ఉపక్షీణో ధర్మః స్వతో నశ్యత్యేవ - న త్వనశిష్యతే ఇత్యర్థః । ఏవం అధర్మనాశనః- అధర్మాపేక్షయా ప్రబలః- జీర్య దధర్మసంబద్ధః । ధర్మోఽపి తత్ఫలం అధర్మఫలం దుఃఖం నాన్వేతీ త్యుభయాన్వయి । ధర్మాధర్మయో రన్యతరబాధేన స్వీయఫలసమర్పణే ఏకతరస్య క్షయే అపరస్య యావన మేవ హేతు రితి భావః। అతోఽపి పూర్వవత్స్వీయప్రవృత్తి రేవ జ్ఞాపికేతి భావః॥

అథవా, ఇతోఽపి బలిన ఇంద్రాదయో ఽపి నిర్జిత్య ప్రజ్ఞయా దుఃఖాదినా యోజితాః । కియా న్మే సుగ్రీవాది రిత్యాశం క్యాహ- న తు ధర్మోపసంహార మితి । అధర్మఫలేన- సంహితా- 'సంధానం యస్యాంక్రియాయా' మితి క్రియావిశేషణం । ధర్మోపసంహారం- ధర్మనాశం న కరిష్యసి- శారీరక బలే మహానపి త్వం ధర్మాధర్మజయే న పర్యాప్త ఇత్యర్థః । అత స్సుగ్రీవాదీనాం ధర్మభూయసాం జయే వా తేషా మధర్మ ఫలక్లేశాదిసంయోజనే వా తవ న శక్తిః । అన్యథా తదాపీతః పూర్వం వైపరీత్యం స్యా దేవేతి భావః । తదేవ సమర్థయతి-తదేవేత్యాది। చకారస్సముచ్చయార్థకః । తుల్యన్యాయేన ధర్మనాశనోఽధర్మ ఇత్యపీతి యోజ్యం। ధర్మాధర్మయో రేవాన్యోన్యజయేన స్వీయఫలదానే స్వాతంత్ర్యం న తు పురుషస్యేతి భావః॥

ఇతి శ్రీమద్రామాయణే హారితసగోత్రోద్భవేన బొమ్మకంటి
నృసింహశాస్త్రిణా విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం
వ్యాఖ్యాయాం సుందరకాండ కిసలయః

తా॥ గొప్పదగు పురుషకారముచే ప్రారబ్ధమునుగూడ నివర్తింపజేసెదను. సావిత్రి మున్నగు పతివ్రత లెట్లుచేసిరో యట్లే యందువేమో! "ధర్మోపసంహారం" ధర్మము దీనిచే సంగ్రహింపబడుచున్నది గాన 'ధర్మోపసంహారం' అనబడును. ఈపక్షమున కరణార్థమున "ఘఞ్" అను ప్రత్యయము రాగా నీరూపము సిద్ధించును. దీనిచే ఆత్మ స్వాధీనము జేయబడును. ఇచ్చట నధికరణార్థమున "ఘఞ్" అను ప్రత్యయముచే నీరూపము సిద్ధించును. "ధర్మములయొక్క ఉపసంహారము" అని షష్ఠీతత్పురుష సమాసము. పుణ్యాతిశయమునకు సాధనమని యర్థము. అది యును తపస్సు హోమము పూజ మున్నగునవి. "తంతునకరిష్యసి" దానిని చేయవైతివి; అందుకు కారణము "అధర్మఫలసంహితం" "సంహితం" అనునప్పుడు "సమోవాహితతయోః" అను సూత్రముచే మకారలోపము వికల్పముగా "సమ్" అను దాని మకారమునకు లోపము లేదు. అధర్మఫలముతో గూడి యుండుటయే అట్లు సుకృతము చేయకపోవుటకు కారణము. ప్రబలమైన అధర్మరూపమయిన అభ్యంతరమువలన నదీవేగమున ఇసుకతో గట్టిన సేతువువలె నీయొన స్వాధర్మమంద స్థిరపడజాలదని భావము. ఇంతకుముందు సంపాదింపబడిన ధర్మము యొక్క బలముచేతనే పాపములు నశింపగలవు. ఇప్పుడు క్లేశపడనేలయందువేమో! దానికి సమాధానము చెప్పుచున్నది. "అధర్మనాశనశ్చ" "ధర్మముచే పాపమును పోగొట్టుకొను

చున్నాడు" అను శ్రుతిచొప్పున అధర్మమును నశింపజేయుటకు హేతువయిన పూర్వమున సంపాదితమయిన ధర్మమును "తదేవ ఫలం" అంత పరిమితమైన సుఖమునే "అన్వేతి" అనుసరించు చున్నది. ఎట్టిసుకృతమునకు ఎంతఫలము నిచ్చుటకు శక్తిగలదో అంతటి ఫలము నిచ్చుటకే యది సమర్థమగును. అంతకంటె నెక్కువగ గాని తక్కువగ గాని ఫలమునిచ్చుటకు సమర్థము కాజాలదు. అట్లే కాకున్నచో స్వల్పమైన సుకృతము చేతనే గొప్పఫలము సిద్ధించుచుండ ఐహికఫలవిషయమున గాని, ఆముష్మిక ఫలవిషయమున గాని ఎవడు శ్రమపడును. కావున నట్టి నీ యభిప్రాయము సరిగాదని భావము. దీనికి తరువాతి శ్లోకమందు "క్షిప్రమేవప్రపత్స్యసే" (శీఘ్రముగనే ఫల మందగలవు) అను నంతవఱకు నుండెడి సందర్భముచే, ధర్మఫల మచిరకాలములో గలుగునని చెప్పుటచే, చేయబడిన తపస్సునకు ఎట్టి సంబంధము కూర్పబడినదందువేమో వినుము. తపస్సనగా చిత్తవృత్తినిరోధము. ఆనిరోధము విక్షేపసామగ్రి యున్నపుడు సంభవింపదు. నీప్రారబ్ధమునకు ఫలమైన క్లేశవిశేషస్వరూపమునకు ఆధారమైన నీచిత్తమందు, నిరోధము లేనిదే సుకృత మాచరింపవలె నను ప్రవృత్తి కలుగనే కలుగదు. తేజస్తిమిరములు (వెలుగు చీకటులు) ఒకచో నుండనట్లు, చిత్తవిక్షేపము, సుకృత ప్రవృత్తులు, రెండును నొకచో నుండజాలవు. రాత్రి యందలి చీకటి రాబోవు ప్రాతఃకాలమందలి తేజస్సునకు ప్రతిబంధక

మైనట్లు, ఆ అధర్మఫలము అచిరకాలమున సంభవించుననుటకు, నాయంశమైన (జటాయువునకు) సంభవించిన అపజయపీడను నేజూచుట, నీయుద్యానము భగ్నమగుట, అక్షయకుమారుడు నశించుట మున్నగునవియే నిదర్శనములు. "నసంభవతి" ధర్మమందు ప్రవృత్తిగలుగదు. చిత్తవిక్షేప మట్టి ప్రవృత్తికి ప్రతిబంధకము గాన, అల్పకాల మాచరింపబడిన తపస్సైనచో నప్పు డది మనుజునివలన చంపబడక పోవుట యను ఫలము నీయజాలదు. అనేకవత్సరములు చేసిన తపస్సే అట్టిమహాఫలము నీయజాలును. కావున నైదారు దినములయందే భోగమునకై యారంభించిన అధర్మము, చిత్తమువ్యాకులపరుచునదియే యగును. కావున చిన్నదగు వృత్తి గాఢాంధకారమునువలె, గొప్పదైన నీ ప్రారబ్ధావస్థనుండి ప్రాప్తమైన అధర్మమును, నీ వాచరించిన ధర్మము తొలగించుటకు సమర్థము కాకపోవుటయేగాక, దౌర్బల్యమును సంపాదించుచు స్వయముగనే నశించునని భావము. లేదా, "పుట్టినవానికి చావు తప్పదు" అను ప్రత్యక్షప్రమాణముచే భూమిపై జనించినవానికి మృత్యువు తప్పక కలిగి తీరును. గాన ఆవిషయమున నాకేమియు చింతలేదు. ఇకమీదనైనను చిరకాలము ధర్మఫలము కలిగినపుడు ఏదియో యొకకారణమున దేహము భంగమగును. ఇప్పుడు భయపడనేల యందువేమో ? 'అధర్మఫలసంహితం' అధర్మముయొక్క అత్యంతసంబంధము గల 'ధర్మోపసంహారం' ఉపసంహృతమైన ధర్మము తా నీయ

వలసిన ఫలము నంతను ఇచ్చివేయుటచే క్షీణమై, సుఖ మనెడు ఫలముతో గూడియే యుండదు. చమురు క్షీణింపనంత వరకు దీపము ప్రకాశించినట్లే, ఈయదగిన ఫలము నిచ్చివేయు టచే క్షీణించిన ధర్మము స్వతస్సిద్ధముగ నశించునుగాని మిగ లదు. ఈరీతిగనే "అధర్మనాశనః" అధర్మముకంటె ప్రబలమైన (జీర్ణమయిన అధర్మముతోగూడిన) 'ధర్మోఽపి' ధర్మమును 'తత్ఫ లం' అధర్మఫలమైన దుఃఖమును "నాన్వేతి" సంబంధింపదు. ధర్మాధర్మములు నొకదాని నొకటి బాధించి, తమ తమ ఫలము లను సమర్పించునపుడు, ఒకదానికి క్షయము కలుగుట, వేరొక దానికి యావనము కలుగుటకు కారణ మగునని భావము. ఇచ్చుటను వెనుకటివలె తన ప్రవృత్తియే దీనిని దెలుపు నుదా హరణము. లేదా, వెనుక నేను ఇంతకంటె బలవంతులగు ఇం ద్రాదులను జయించి దుఃఖముతో గూర్చినాను. సుగ్రీవుడు మున్నగువారు నాకేపాటివా రందువేమో? ఆ ధర్మఫలముతో కూడిక గలిగిన ధర్మనాశమును చేయలేవు. శరీరబలమందు గొప్పవాడవైనను ధర్మాధర్మములను జయించుటకు సమర్థు డవు కావని యర్థము. కావున ధర్మముచే గొప్పవారైన సుగ్రీ వాదులను జయించుటయందుగాని, వారికి అధర్మమునకు ఫల మైన బాధలను గూర్చుటయందుగాని, నీకు శక్తిలేదు. అట్లు గాకున్నచో, ఇంతకుముందే వైపరీత్యము కలిగియుండునని భావము. దానిని సమర్థించుటకై 'తదేవ' మున్నగునది."ధర్మశ్చ"

అనునప్పుడు చకారము సముచ్చయార్థమును బోధించునది. తుల్యన్యాయముచే ధర్మనాశకమైన అధర్మమును ఫలముతో గూడునని కూర్చుకొనవలెను. ధర్మాధర్మములకే తమతమ ఫలముల నిచ్చుటకు స్వాతంత్ర్య ముండును గాని, పురుషకారమున కట్టి స్వాతంత్ర్య ముండజాలదని భావము.

ఇట్లు శ్రీహారితసగోత్రోద్భవ బొమ్మకంటి నృసింహ
శాస్త్రి విరచితంబైన శ్రీమద్రామాయణ
కల్పవల్లికా వ్యాఖ్యానమందు సుందర
కాండ కిసలయము.

---

# యుద్ధకాండ వ్యాఖ్యా

## విభీషణశరణాగతి ప్రకరణం

స 18. శ్లో॥ 1. అథ రామః ప్రసన్నాత్మా శ్రుత్వా వాయుసుతస్య హ। ప్రత్యభాషత దుర్ధర్ష శ్శ్రుతవా నాత్మని స్థితం॥

వ్యా॥ ప్రసన్నాత్మా- స్వాభావికప్రసాదయుక్తాంతఃకరణః । అథ - సుగ్రీవవాక్యశ్రవణానన్తరం । వాయుసుతస్య- పితృవ త్పరానపేక్షయా గుణాసంగితయా సహజబుద్ధిబల ప్రయుక్తం వాక్యం శ్రుత్వా। హేతి-హార్షే। విభీషణ స్వీకారవిషయే స్వస్వమతం బ్రూహీత్యవిశేషేణ స్వనియోగం జ్ఞాత్వాపి రాజభృత్యన్యాయేన సుగ్రీవాది మత్రోపన్యాసం నిరీక్ష్య వక్తవ్యాంశస్య బుధ్యనుసారేణైవ పరమతావలంబీ అభిదధాతీతి హర్షః । సుగ్రీవాదివాక్యజన్యకాలుష్యానాకలిత ఇతి తు న యుక్తం కల్పయితుం । విభీషణవాక్యశ్రవణావ్యవధానే నైవ ప్రసన్నాత్మేత్యాది విశేషణబలేన తథైవార్థప్రతీతేః । దుర్ధర్షః- స్వస్వమతబోధనకుశలై రపి పరై రకంప్యచిత్తః । తత్ర హేతుః । శ్రుతవాన్- శ్రుతే ష్వర్థేషు సారగ్రాహీ । ప్రశంసాయాం మతుప్ । ధనవా నిత్యాదివత్ । ప్రాశస్త్యం చ వివక్షానుసారేణ బోధ్యం- ఆత్మని స్థితం- అంశభేదేన సుగ్రీవాది సకలమాంత్రిమతానుబంధి తదనుబంధిచ వక్తవ్యవిషయం । ప్రత్యభాషత-స్ఫుటం ప్రతిపాదితవాన్। సుగ్రీవమతే త్యాజ్యత్వ

హేతుతయా ఉపన్యస్తస్య సుప్తత్వస్య కపోతాదిస్థలే వ్యభిచార ప్రదర్శనేన హేతోరనైకాంతికత్వం । హనుమద్వాక్యే సజ్జనాంతర్భావేణ "దోషో యద్యపి" త్యాదినా దుష్టత్వేఽపి గ్రాహ్యత్వప్రతిపాదనేన తద్ధేతోస్సాధ్యాసాధకత్వా చ్ఛరణాగతత్వహేతుప్రదర్శనేన తద్ధేతుదూషణ మితి బోధ్యం । విరోధిత్వే ఽపి శరణాగతత్వ మేవ హేతు రితి తదుక్తహేతో ర్గ్రాహ్యత్వే హేతుత్వ మితి మంతవ్యం । తస్మి న్నాత్మీయ బుద్ధ్యుదయాభిధానాత్ । అత ఏవ "దత్త మస్యాభయంమయే" త్యాది వక్ష్యమాణగ్రంథేన శరణాగతిమాత్రే నైవ తస్మి న్నాత్మీయత్వబుద్ధిప్రతీత్యా కాలుష్యాప్రసక్తేః కల్పనానవకాశాత్ । "మిత్రభావే" నేతి రామప్రతిజ్ఞావిరోధ స్స్పష్ట ఏవ.

విభీషణశరణాగతి ప్రకరణము.

తా॥ 'ప్రసన్నాత్మా' స్వభావసిద్ధమైన ప్రసన్నతతో గూడిన అంతఃకరణము గల 'రామః' శ్రీరాముడు "అథ" సుగ్రీవుని వాక్యమును వినినతరువాత, "వాయుసుతస్య శ్రుత్వా" తనతండ్రివలె ఇతరుల అపేక్ష లేకుండగనే సుగుణములతో గూడినవాడగుటచే సహజమైన బుద్ధిబలముతో గూడిన ఆంజనేయుని వాక్యమును విని. 'హ' అనునది సంతోషసూచకము. విభీషణుని స్వీకరించుట విషయమై మీమీ మతములను చెలుపుడని విశేషములేకుండ తన నియోగమును దెలిసియును రాజభృత్యన్యాయమున సుగ్రీవాదుల మతములను దెలిసి, చెప్పదగిన అంశమును బుద్ధి ననుసరించియే పరమతము నవలంబించి (సుగ్రీవుడు)

చెప్పుచున్నాడని (రామునికి) హార్దము. సుగ్రీవుడు మున్నగు వారు చెప్పినవాక్యములవలన గలిగెడు కాలుష్యము లేకుండు టచే హార్దమని కల్పించుట యుక్తముగాదు. విభీషణుని వాక్య మును విన్నంతనే "ప్రసన్నాత్మా" అను విశేషణముచేతనే అట్టియర్థము తోచుచున్నది. "దుర్ధర్ష" తమతమ మతములను బోధించుటయందు నిపుణులైన యితరులచే చలింపచేయ శక్య ముగాని చిత్తముగలవాడు. అందులకు కారణము. 'శ్రుతవాన్' విన్నయర్థములందలి సారమును గ్రహించువాడగుట. 'ధనవాన్' మున్నగు పదములందువలె "శ్రుతవాన్" అనునప్పుడు ప్రశంసా ద్యర్థమందు మతుప్ప్రత్యయము. ఇక్కడ ప్రాశస్త్య మనగా మన వివక్ష ననుసరించియే బోధించునది. "ఆత్మనిస్థితం" వారి వారి యభిప్రాయభేదముల ననుసరించి సుగ్రీవుడు మున్నగువా రందఱిమతములకు సంబంధించినట్టియు, ప్రస్తుతాంశమునకు సంబంధించినదియు నగు చెప్పదగిన విషయమును "ప్రత్యభా షత" స్పష్టముగ ప్రతిపాదించెను. సుగ్రీవుని మతమున (విభీష ణుని) విడిచిపెట్టుటకు కారణముగ దెలుపబడిన దుష్టత్వమునకు (దోషముతో గూడుటకు) కపోతాది వృత్తాంతమందు వ్యభి చారము కనబడుచున్నది గాన, హేతువున అనైకాంతికమను దోషముతోగూడినది గాన సాధ్యసాధకము కానేరదు. హను మంతుని వాక్యమునందు సజ్జనాంతర్భావముచే "దోషోయద్యపి" మున్నగు వాక్యముచే దుష్టత్వమున్నను గ్రహింపతగినదని ప్రతి పాదనచేయుటచే, ఆహేతువు సాధ్యసాధకము కాదు గాన,

శరణనొందుట యను హేతువును ప్రదర్శించుటచే, ఆహేతువును దూషించుటయని తెలియదగినది. విరోధిత్వమున్నను శరణాగతత్వమే హేతువని ఆతఁడు (హనుమంతుఁడు) చెప్పిన హేతువు గ్రహింపదగుటయందు కారణ మున్నదని తలంపవలెను. ఆతని (విభీషనుని) యందు తనవాఁడను బుద్ధిపుట్టినదనుటయు నిందుకు గారణము. కావుననే "ఈతని కభయ మీయబడినది" అని ముందుచెప్పునట్టి ప్రసంగముచే, శరణనొందిన మాత్రముననే ఆతనియందు తనవాఁడను బుద్ధి కలుగుటచే, ఆతని విషయమున కాలుష్యము ప్రసరించినదని కల్పించుట కవకాశము లేదు. "మిత్రభావముచే వచ్చిన" మున్నగు రాముని ప్రతిజ్ఞకు విరోధముగూడ తటస్థించుట స్పష్టమే.

స 18. శ్లో॥ 2. మమాపి తు వివక్షాస్తి కాచి త్ప్రతి విభీషణం।
తత్సర్వం శ్రోతు మిచ్ఛామి భవద్భి శ్శ్రేయసి స్థితైః॥

వ్యా॥ "మమాపి తు వివక్షా" ఇత్యాది. విభీషణం ప్రతి- త మధికృత్య- వివక్షా- వక్తు మిచ్ఛా । కాచి ద్విషయవిశేష నిర్ణయానుబంధినీ- న తు తత్త్వనిర్ణినీషా। భవద్భి రితి- సహ యుక్త ఇతి తృతీయా। వినాపి తద్యోగం తృతీయేత్యుక్తేః। శ్రోతు మితి। తత్సర్వం- మద్వివక్షిత యావదంశగత గుణదోష విమర్శపరం యుష్మ ద్వాక్యజాత మిత్యర్థః। భవంత ఇవ అహమపి శ్రోతైవ। న తు తత్త్వనిర్ణయపరః। పరం తు యుష్మదీయ యావద్వాక్యశ్రవణానంతరం కుతుకేన వివక్షు రభవ మితి తాత్పర్యం। భవద్భి రితి- శబ్ద మప్రాధాన్యం అర్థం తు ప్రాధాన్యం।

"రాజ్ఞా సహ సేనా గచ్ఛతీ" త్యాదావివ తృతీయాంతార్థస్య చేతి శ్రీరామస్య సుహృత్త్వారతంత్ర్యం నామ గుణవిశేషో ద్యోత్యతే। కింతు-శ్రేయసి స్థితైః-విషమదశాయా మపి న్యాయ మార్గా దప్రచ్యవద్భిః- అనేన తాదాత్వికఫలాపేక్షయా ధర్మా త్పృథో నివృత్తిః న మే గ్రాహ్యా ఇతి సూచ్యతే। భవద్భి రిత్య స్య శ్రవణక్రియాన్వయే సమానకర్తృకత్వాభావా చ్ఛ్రోతు మితి తుము న్నస్యాత్ । తథాచ తృతీయా తు నిర్మూలత్వా దగతికైవ। ఏవం చ భవద్భి శ్శ్రుత్వా పరీక్షణం కార్య మితి ఫలితార్థతయా ప్రాచాం మత మితి వేదితవ్యం । "త్వయా గంతు మిచ్ఛామి" త్యత్రేవ సహార్థప్రతీతే ర్వ్యుత్పన్నసిద్ధ త్వాత్। యద్వా- భవద్భి రితి తృతీయా-'అగతికగతి శ్శూన్యా' వేతి గ్రాహ్యం। "పుత్రస్య పఠన మిచ్ఛతీ" త్యత్ర పఠితు మితీతి న సాధు। భవద్వాక్యస్య పరస్పరభిన్నార్థకతయా "గుణదోషపరామర్శిత్వేశాలినీ"తి న్యాయేన సర్వేషా మపి స్వభిన్నవక్తృకవాక్యార్థవిమర్శితౌచిత్యా 'ద్భవద్భి' రిత్యుక్తి స్సంగచ్ఛతే। యద్వాపి-'యుక్తియుక్తం వచో గ్రాహ్య' మిత్యా దినా స్వోక్తేఽప్యంశే పక్షపాతం విసృజ్య యుక్త మేవ గ్రాహ్య మితి పఠితై రిత్యర్థః॥

తా॥ 'విభీషణంప్రతి' విభీషణు నుద్దేశించి, 'కాచిద్వివక్షా' విషయవిశేషనిర్ణయముతో సంబంధింపనిది, యథార్థ మును నిర్ణయింపవలెనను నిచ్ఛ లేనిది. "భవద్భిః" అనుచోట "వినాపితద్యోగం తృతీయా" (సహాశబ్దముతో సంబంధము లేకు

స్నను తృతీయ రావచ్చును) అనుదానిచే తృతీయావిభక్తి సిద్ధించును. "తత్సర్వం శ్రోతుమిచ్ఛామి" నేను అడుగదలచినవిషయము నంతకు సంబంధించిన గుణదోషముల విమర్శనముతో గూడిన మీ వాక్యముల నన్నిటిని వినగోరుచున్నానని యర్థము. మీవలెనే నేను వినువాడనే గాని తత్త్వమును నిర్ణయించువాడను గాను. కాని మీమతములనన్నిటిని విన్నపిమ్మట కౌతుకముతో గొంత తెలుపనై యున్నాడనని తాత్పర్యము. "భవద్భిః" అనుచోట శబ్దసిద్ధమయిన అప్రాధాన్యము, అర్థసిద్ధమైన ప్రాధాన్యమును "రాజుతోగూడ సేన వెళ్ళుచున్నది" మున్నగు వాక్యములందువలె తృతీయార్థమునకు ప్రాధాన్యమని, శ్రీరామునకు స్నేహితులయందు తాత్పర్యమనెడు గుణవిశేషము తోచుచున్నది. "కింతు" ఇక నేమంటే, "శ్రేయసిస్థితైః" విషమావస్థయందును న్యాయమార్గమునుండి తొలగనట్టి. ఇట్లనుటచే తతాల్కాలమందు సిద్ధించెడి ఫలము నపేక్షించి ధర్మమార్గమును విడుచుటనాకు స్వీకరింపతగినది గాదని సూచింపబడుచున్నది. "భవద్భిః" అను తృతీయాంతమునకు "శ్రోతుం" అను శ్రవణక్రియతో నన్వయించినచో నపుడు "తుమున్" అను ప్రత్యయము రాదు. అప్పుడు తృతీయావిభక్తి వచ్చుట కాధారముండదు గాన అగతిక మయగును. కావున మీచే విని పరీక్ష చేయతగినది యని ఫలితార్థము" అని ప్రాచీనవ్యాఖ్యాతలు వ్రాసినదంతయు దోషభూయిష్ఠమని తెలిసికొనవలెను. 'నీతో వెడల నిచ్ఛయించుచున్నాను' మున్నగు వాక్యములందువలె "కూడ" యను

సర్థము తోచుట వ్యుత్పన్నసిద్ధము గాన నిచ్చట తృతీయావిభ క్తియు నట్లే సిద్ధించుననుకొనవచ్చును. లేదా, 'భవద్భిః' అను తృతీయావిభక్తి "అగతికగతి" కాదని గ్రహించదగినది. 'పుత్రుని చదువును గోరుచున్నాడు' అను స్థలమందు "పుత్రుడు చదువుటకు గోరుచున్నాడు" అనుట సాధువుకాదు. మీావాక్యములు పరస్పరము, భిన్నార్థకములగుటచే "గుణదోష" అను న్యాయము ననుసరించి తనకంటె భిన్నమైన వక్తయొక్క వాక్యార్థమును విమర్శించుట యుచితము గాన 'భవద్భిః" అనునది సరియే. లేదా, "యుక్తితోగూడిన వాక్యము గ్రహింపదగినదను న్యాయముచే తాను చెప్పిన విషయమునందును పక్షపాతమును వదలి యుక్తమైనదియే గ్రహింపతగినదని యర్థము.

స 18. శ్లో॥ 3. మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన।
దోషో యద్యపి తస్యస్యా త్సతా మేత దగర్హితం॥

వ్యా॥ వివక్షితమర్థంవ్యనక్తి। మిత్రభావేన-స్వప్రతికూలేఒపి భ్రాతరి హితబోధకస్యాస్య మిత్రత్వం సర్వవిదితమే వేతి నాస్య హృదయపరీక్షావసర ఇతి భావః। శ్రోతాతు తం గృహ్ణాతువా మావా- వక్తాతు మిత్రమే వేతి నిశ్చయః। అత ఏవ "యస్తి త్యాజ సఖి విదగ్ం సఖాయ" మిత్యాదినా సర్వమనుష్యసామ్యేన స్వస్యామిత్రత్వ మేవేతి శ్రుతిః। తదనుగామీ తు కశ్చి దేవ సహస్రాణామితి- "మనుష్యాణాం సహస్రే" ష్విత్యాదినా భగవాన్ శ్రీకృష్ణః। సంప్రాప్తం- సమ్యక్త్వం చ దేశకాలానుగుణత్వం- తచ్చ రావణస్యాపి సంభావ్య మేవేతి

మిత్రోత్తమత్వ మస్య కి ముచ్యత ఇత్యాశయః। అత ఏవ- 'యది వా రావణ స్వయ' మితి వక్ష్యతి॥

2. యద్వా- మిత్రభావేన- మిత్రమేవ భవతు రాను ఇతి దృఢభావనయా ఇత్యర్థః। అత ఏవ భావనాదార్ఢ్యేన తద్వ శీకృత మాత్మాన మన్యథాకర్తుం న శక్నుయా మితి న త్యజేయ మిత్యుక్తిః। అత ఏవ మృద్దారుశిలా వా భగవద్భావనయా కృతార్థయం త్యాత్మానం సంత ఇతి సర్వశాస్త్రోద్ఘోషః। సా చ భావనాభక్తిర్వా ఉపాసనా వేత్యాది తు విచారాంతరం। భావ్యాకారాకారితాంతఃకరణవృత్తికత్వం హి భావనాయా స్స్వభావ ఇతి తు సర్వసంప్రతిపన్నం! అత ఏవ న త్యజేయం కథం చ నేత్యుక్తి రితి భావః। తాదృశమిత్రవాక్యస్య శాబ్ద ప్రమాణజనకత్వే ఽపి ప్రకృతివిరుద్ధం కర్తుం న శక్నుయామితి భావః। అత ఏవ 'సదృశం చేష్టతే స్వస్యా' ఇతి భగవదుక్తిః। "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమ స్కురు" ఇత్యా దినా భావనాయా స్సర్వథా ప్రాశస్త్యం ప్రతిపాదితం। "దోషో యద్యపి తస్య స్యా త్సతా మేత దగర్హితం". యద్యపి తస్య విభీషణస్య దోషః పరిత్యాగహేతుర్ధర్మః సుగ్రీవా ద్యుక్తమా గ్రేణ విచారితే స్యాత్సంభావ్యత ఏవ। సూక్ష్మదృశా విచా రే దోషరహితమేవ వస్తు నాస్తి- పరం తు "గుణదోషౌ బుధో గృహ్ణ" న్నిత్యాదిరీత్యా గుణైకదృశాం తు పురుషాణాం గుణ ప్రీత్యా ఔషధాదావివ దోషవిసర్జనం- అగర్హితం-నింద్యం న

భవతి- పరం తు గ్రాహ్యమేవ- అన్యథా సర్వస్యాపి త్యాజ్యత్వాపత్తి రితి భావః॥

3. యద్వా- మిత్రభావేన- నాహ మితఃపూర్వ మస్య త్రివిధమిత్రమధ్యే కతమమపి మిత్రం నాసం- కింతు శత్రుభూతః మిత్రే- వస్తుతో మిత్రే తన్సుహృద్యో యో భావ స్తేన సంప్రాప్తం- నిర్భీకతయా ప్రాప్తం- అతఏవ-తోపనతతయానేకశ్రేయస్సాధనభూతం । న త్యజేయం- యది న తథా తర్హి యుష్మాదృశమహావీరపరివారసమేతస్య మమ సన్నిధిం న ప్రాప్నుయాదేవ- అతో గ్రాహ్య ఏవేతి భావః॥

4. యద్వా- మిత్రభావేన- రాజ్ఞ స్స్వసోదరస్య విద్విషత స్సత స్తత్సంబంధినా మపి స్వశత్రుత్వేన- తన్మధ్యే స్వసత్తాయా అశక్యత్వేన మే కేచన మే మిత్రాణి భూయాసు రితి- కథంచన- అత్యంతక్లేశేన ప్రాప్తం న త్యజేయం । అగ్నిపరీతే సద్మనీవ అనేకశత్రుమధ్యే సుఖ మలబ్ధ్వా యుష్మాదృశమిత్రకోటికామనయా నిఖిలా నపి శత్రూ న్ప్రతార్య ఘుర్మాతురస్య మరుదేశా చ్ఛీతలవృక్షచ్ఛాయా మాగతస్యే వాస్య త్యాగ స్సుతరా మనుచితః। అత ఏవ- 'నివేదయత మాం క్షిప్ర' మితి యుష్మా న్సమాచుద దితి భావః॥

"దోషో యద్యపి తస్యస్యా త్సతా మేత దగర్హితం". యద్యపి నీతివిచారే। తస్య- విభీషణస్య- రావణసంబంధవిశిష్టస్య దోషః- ఏతాదృ శాపత్కాలే సోదరత్యాగో వ్యతికరస్స్యాత్ । సతాం తు ఏత ద్భ్రాతృవిసర్జనం। అగర్హితం- నింద్యం న భవతి।

"గురోర ప్యవలి ప్తస్య కార్యాకార్య మజానతః । ఉత్పథం ప్రతిప న్నస్య యుక్తదండో విధీయతే" ఇతి స్మరణాత్ । అత స్సామా న్యశాస్త్రస్య విశేష శాస్త్రవ్యతిరిక్తవిషయకత్వం పరికల్ప్య 'మా హింస్యా' దితి వ త్సార్థక్యం కల్పనీయ మితి భావః॥

5. అథవా- మిత్రభావేన- మమ ద్రోగ్ధార మేకం నిమిత్తీకృత్య సర్వా నపి రాక్షసా న్హంతు ముద్యుక్తే మయి- మిత్రభావేన- చిరంతనమిత్రే యో భావ స్తాదృశభావేన- అన్యథా "సవేదయత మాం క్షిప్ర"మితి యుష్మాసు సౌము ఖ్యం న ప్రకటయేదే వేతి భావః । న త్యజేయం- త్యాగసం భావనాపి నా స్తీత్యర్థః । త్యాగస్తు దూరాపా స్త ఏవేతి భావః। కథంచన- యుష్మదీయనిర్బంధేఽపీత్యర్థః । యద్యపి సద్యు గ్విచారే కాలక్రమేణ దోష స్స్యా త్తదాతనదోషసంభావ నయా ఏత త్తస్య విభీషణస్య అవిసర్జనం । అగర్హితం- నిందిత భిన్నం- అప్రతిషిద్ధ మితి యావత్ । సతాం ధర్మభీరూణాం "అప్రతిషిద్ధ మనుమత" మితి న్యాయేన యుక్తమేవేతి భావః । ఆగామిదోషసంభావనయా ప్రత్యక్షదృష్టధర్మపథానువ ర్తినః పరిత్యాగ స్సతాం సుతరా మనుచిత మితి భావః॥

6. కించ- మిత్రభావే సతి- యావత్క్షణపర్యంతం స్వస్య రావణే నైకమత్య మాసీ త్తావత్పర్యంతం । న సంప్రా ప్తం- రాజ్యా ద్యకామనయా భ్రాత్రాజ్ఞ యైవ వర్తమాన మిత్యర్థః । ఏవం చ- అద్యతు సర్వాత్మనా ధర్మం విహాయ స్వాచ్ఛంద్యేన వర్తమానత్వా దయం నిరంకుశో మదహ స్తీవ సర్వా నపి బాధి

ష్యత ఇతి ధియాగ్నిపరీతం మహాగృహం జిజీవిషు రివ భ్రాత రం త్యక్త్వాఽస్మత్సన్నిధిం ప్రాప్త మితి లభ్యతే। కథంచన- భవద్భి ర్న్యాయంతో దోషా అస్య త్యాగే అభిహితా స్తత్సకల. దోషాస్పర్శితయా నిశ్చిత్త్యైనం న త్యజేయం- త్యాగవిధిం నోప లభే ఇత్యర్థః। విధా లిజ్- యద్యపి జ్యేష్ఠకనిష్ఠ యో రావణ విభీషణ యో రన్యతరస్య గుణదోషవిచారే దోష ఏతాదృశ సంకటే ధర్మబోధనపర మనుజం విహా యానర్థభాగిన స్తస్య రావణ స్యైవస్యాత్పాపవృత్తే ర్జ్యేష్ఠస్య। మణిమాళే రపి భుజంగ స్యేవ త్యాగిన అస్య విభీషణస్య నేత్యర్థః। అవిచార్య పరత్ర దోషోద్ఘాటనే "దృష్టిపూతం న్యసే త్పాదం వస్త్రపూ తం పిబే జ్జలం। సత్యపూతం వదే ద్వాక్య। మేషధర్మస్సనాతన" ఇతి న్యాయవిరోధ ఇతి భావః॥

7. యద్వా- ఏతావ త్పర్యంతం భ్రాత్రా రావణేన మిత్రత్వే నైవ సీతాపహరణకాలో దశమాస్యో జాతః- అను కూల్యేనైవ తదనుమతం జ్ఞాత్వా కాలం యాపయ న్నాసం- అద్య తు భ్రాత్రీయభావం నిశ్చితం జ్ఞాత్వా వైరీ జాతం- అత ఇదం చాస్మాకం సుకృతకామితానాం మహ దదృష్టం యద్యం త్యంతపుణ్యపురుషసంబంధలాభ ఇతి। అతో న త్యజేయం। చా తుర్వీరస్య సత్పాత్రలాభ ఇవ అస్య భ్రాత్రా విరోధో మహా శ్రేయ ఏవేతి భావః॥

8. యద్వా- అవయో ర్యన్మిత్వత్వ మగ్నిసాక్షి కతయా నిశ్చితం- అత ఏవ సుప్రసిద్ధం। తేన సంప్రాప్తం-

తాదృశమిత్రత్వఫలకామనయా సంప్రాప్తం- సమ్యగాగతం- జ్యేష్ఠభ్రాతుర్యేవ సభాయాం ప్రకటయ్య దోషం, బలవతా శత్రుణా సంగమ్య కిం వాపకృతిం మే కరిష్యత్యయమితి స్వ సంకల్పనిరోధం రావణకర్తృకం పరిహృత్య కౌశలేన ప్రాప్త మిత్యర్థః।

9. యద్వా- మిత్రభావేన- ఆత్మనో జ్యేష్ఠభ్రాతరి రావణె ఏకస్మిన్నేవ మమ ద్రోగ్ధరి కుంభకర్ణమారీచమాల్యవ దాదీన్నాతిస్వభావేన క్రూరానపి స్వప్రతిలోమే నైవ ధర్మ బోధకతయా వర్తమానాన ప్యనాదృత్య కోపేన సర్వరాక్షసా నపి హన్తు ముద్యుక్తే మయి వస్తుత శ్శత్రుమిత్రయో ర్భావ స్తేన సంప్రాప్తం । కథంచన- త్రివిధశత్రుభావ మాలోచ్యాపి- న త్యజేయం- త్యక్తుం న శక్నుయాం- 'కపోతో వానరశ్రేష్ఠ' (స 18. శ్లో॥ 25.) ఇతి- ప్రత్యక్షదృష్టదోష మపి వా వధం శాస్త్రగంధశూన్య మపి శకుంత ముదాహృత్య కైముతికన్యా యే నైతాదృశపురుషపరిగ్రహస్య శరణభావనయాస్య ప్రాణ దానేన గృహీతవతః ధర్మత్వం సమర్థయతి। "స హి తం ప్రతిజగ్రాహ" ఇతి. (స 18. శ్లో॥ 25.)

తా॥ చెప్ప నిశ్చయించిన యర్థమును ప్రకటించుచు న్నాఁడు. "మిత్రభావేన" సోదరుఁడు తనకు ప్రతికూలముగా నున్నను నాతనికి హితబోధచేసియు నీతనిస్నేహ మందరకు తెలిసినదియే గాన, నీతని హృదయమును పరీక్షింపనవసరము లేదని భావము. వినువాఁడు దానిని గ్రహించుగాక, గ్రహింపక

పోవుగాక. చెప్పువాడు మిత్రుడే యనుట నిశ్చయము. 'యస్తి త్యాజ' ఇత్యాది వాక్యమువలన సర్వమనుష్యసామ్యముచే తన కమిత్రిత్వమే యని శ్రుతి చెప్పుచున్నది. దానిననుసరించువాడు వేయింటిలో నొకడే యుండును. "మనుష్యులు వేయింటిలో నొక్కడే యుండు"నని గీతలలో శ్రీకృష్ణభగవానులు దెలిపినారు. 'సంప్రాప్తం' లెస్సగా వచ్చినవాడు. లెస్సగ ననగా దేశకాలములకు తగునట్లుగా ననుట. అట్టిచో రావణునకును గలుగ వచ్చును గాన ఈతని మిత్రిత యందలి ఘనత నేమిచెప్పవలెనని అభిప్రాయము. కావుననే "రావణుడు స్వయముగా వచ్చినను" అని ముందు చెప్పుచున్నాడు. "నాయందు మనముగలవాడవై కమ్ము. నాభక్తుడవై, నన్నుగూర్చి యాగములు చేయువాడవై, నన్ను నమస్కరించువాడవై" కమ్మని శ్రీకృష్ణు డర్జునున కుపదేశించి, భావనకు సర్వవిధముల ప్రాశస్త్యము దెలిపినాడు. "యద్యపి" సుగ్రీవాదులు చెప్పిన మార్గమున నాలోచించినచో "దోషః" విడుచుటకు కారణమైన ధర్మము "తస్య" ఆతనికి (విభీషణునకు) "స్యాత్" ఉండును. సూక్ష్మదృష్టిచే నాలోచించినచో దోషములేని వస్తువే యుండదు. కాని "పండితుడు గుణదోషములను గ్రహించును" మన్నగు వాక్యములచొప్పున గుణమందే పక్షపాతముగల పురుషులకు గుణమందే ప్రీతి యుండుటచే, ఔషధమందువలె దోషమును వదలుట "అగర్హితం" నిందింపదగినది గాదు. మఱియు గ్రహింపదగినదియే. అట్లు కాకున్నచో ప్రతివస్తువును విడువదగినదియే యగును.

2. లేదా, "మిత్రభావేన సంప్రాప్తం" శ్రీరాముకు మిత్రుడే యగుగాక యని దృఢభావనతో సంప్రాప్తమైనవాడని యర్థము. కావున భావనాబలముచే ఆతనికి స్వాధీనుడనైన నన్ను వేరొకరీతిగ జేయుటకు సమర్థుడను కాను గాన, ఆతని విడువనని చెప్పుట. కనుకనే మట్టి, కఱ్ఱ, ఱాయి మున్నగువాని యందు భగవంతుడను భావనచే సత్పురుషులు తమ్ము కృతార్థులనుగ జేసికొనుచున్నారని శాస్త్ర ముద్ఘోషించుచున్నది. ఆభావన, భక్తియా, లేక, ఉపాసనయా, యనునది విషయాంతరము. భావింపదగిన ఆకారముయొక్క ఆకారము గలదై చేయబడిన చిత్తవృత్తి గలుగుట భావనకు స్వభావము గాన అంతయు సరిపడుచున్నది. కావున ఎటులను వదలిపెట్ట ననుచున్నాడు. అటువంటి మిత్రునివాక్యము శబ్దముచేతనే ప్రమాణమును గలుగజేయుటచే స్వభావమునకు విరుద్ధముగ చేయుట కశక్తుడనని భావము. కావునసే జ్ఞానియైనను తన స్వభావము ననుసరించియే చేయునని భగవద్వాక్యము కలదు.

3. లేదా, "మిత్రభావేన" ఇంతకుపూర్వ మీతనికి మువ్విధమైన మిత్రులలో నేనొకడను గాను. మఱియు శత్రువునే. "మిత్రే" వాస్తవమున మిత్రుడైనవానియందాబుద్ధితో "భావః" ఏభావముండునో 'తేనసంప్రాప్తం' ఆభావముచే నిర్భికుడై వచ్చినవాడు. అనుకొనకుండగ వచ్చినవాడు గాన అనేక శ్రేయస్సులకు సాధనమైనవాడు. అట్టి యీతని "నత్యజేయం" విడిచిపెట్టను. అటులనే గానున్నచో మీవంటి మహావీరులగు

పరివారముతో గూడిన నాసన్నిధికి రానేరాడు. కావున గ్రహింప దగినవాడే.

4. లేదా, "మిత్రభావేన సంప్రాప్తం" రాజు, తనసోదరుడు, నగు రావణుడు తన్ను ద్వేషించుచుండగా, ఆతనికి సంబంధించి యితరులు తన్ను ద్వేషించెడివారే యగుదురు గాన నాకివ్వా డెవరైనను మిత్రులగుదురా యని చింతించుచు, ఎట్టులనో మిక్కిలి నేర్పరితనముచే వచ్చిన యీతని 'నత్యజేయం' విడువను. అగ్నిచే ముట్టడింపబడిన గృహమందువలె అనేకులగు శత్రువులమధ్యమున ఏవిధమునను సుఖము నందజాలక, మీవంటి మిత్రకోటు లెక్కడనైన లభించునా యను కోరికతో శత్రువుల నందరను వంచించి, ఎండచే బాధపడిన ప్రాణి, చల్లనైన వృక్షమునీడ నాశ్రయించినట్లుగ వచ్చినాడు. ఇట్టి యీతని విడనాడుట మిక్కిలి యనుచితము. కావుననే "నాకు తొందరగ దెలుపుడని" మిమ్ములను ప్రేరేపించినాడు. "యద్యపి" నీతి దృష్టితో నాలోచించినచో, "తస్య" రావణుని సంబంధముతో గూడిన విభీషణునికి 'దోషగస్యాత్' ఇట్టి ఆపత్కాలమందు సోదరుని విడుచుట యనెడు అపరాధసంబంధ ముండుగాక. 'సతాంతు' సత్పురుషులకైతే, 'ఏతత్' సోదరుని విడుచుట, 'అగర్హితం' నింద్యము కానేరదు. "గర్వితులై, కార్యాకార్యముల నెఱుగనివారై, వ్యతిరేకమార్గమున సంచరించు తన గురువునకైనను తగినశిక్ష విధింపబడును" అని స్మృతి చెప్పుచున్నది. కావున 'హింస చేయకూడదు' అను సామాన్యశాస్త్రమునకు

"యాగమందు గవాలంభనము చేయవచ్చును" అను విశేష శాస్త్రముకంటె నితరమయిన విషయమును కల్పించి (అనగా యాగముకంటె నితరములగు సమయములందే ప్రాణిని హింసింపగూడదు) విశేషశాస్త్రమునకు సార్థక్యము కల్పించినట్లు ఈవిషయమును సమర్థింపతగియున్నదని భావము.

5. లేదా, "మిత్రభావేన సంప్రాప్తం" నాకు ద్రోహముచే రావణునొక్కని నిమిత్తముగా జేసికొని, రాక్షసుల నందరను హింసించుటకు నేనుద్యుక్తుడ నగుచుండగా, పురాతన మిత్రునియందే భావముండునో యట్టిభావముతో వచ్చినాడు. లేకున్న తొందరగా దెలుపుడని మీావిషయమునందు సుముఖతను ప్రకటింపచేయక నే యుండునని భావము. "నత్యజేయం" కావున నే సీతని విడువను. విడువవలెనను నూహయే లేదు అని అర్థము. విడుచుట అసలే పొసగదని భావము. 'కథంచన' మీారు నిర్బంధముచేసినను విడువనని యర్థము. విచారింపగ నిట్లు చేసిన, కాలక్రమముచే దోషము రావచ్చును. అప్పుడు వచ్చు దోషము నూహించుటచే ఇప్పుడీ విభీషణుని విడువకుండుట 'సతాం అగర్హితం' ధర్మభీరువులైన సత్పురుషులకు నింద్యము కాజాలదు. 'నిషేధింపబడనిది యంగీకృతమే' అను న్యాయముచే ఇట్లు చేయుట యుక్తమే యని భావము. రాబోవుదోషము నూహించి, ప్రత్యక్షముగ గన్పడు ధర్మమార్గమున సంచరించువానిని విడుచుట సత్పురుషులకు మిక్కిలి తగదనిభావము.

6. మఱియు, "మిత్రభావేనసంప్రాప్తం" ఏ క్షణమువరకు తనకు రావణునితో మిత్రత్వ మున్నదో అంతవరకు రానట్టివాడు. రాజ్యము మున్నగువానిని గోరక సోదరుని యాజ్ఞ యందున్న వాడని యర్థము. ఇప్పుడన్ననో, సోదరుడు సర్వవిధముల ధర్మమును వదలి స్వేచ్ఛగ నున్నాడు గాన, ఈత డంకుశములేని మదపు టేనుగువలె మనల నందరను బాధించునను నూహ పొడముటచే, అగ్నిచే నావృతమైన గృహమునుండి బ్రతికి బయట పడగోరువాడు వదలివేసినటుల, సోదరుని వదలి మనసమీపమునకు వచ్చినాడు. 'కథంచిత్ నత్యజేయం' ఇట్టి వీనివిషయమున మీచే నెన్ని దోషములు విచువవలెనని సమర్థించుచు దెలుపబడినవో, వానిలో నేవియు వీనిని స్పృశింపవని తలచి, వీనిని విడువనని యర్థము. విడిచిపెట్టుట యనువిధిని పొందను. 'త్యజేయం' అను పదము విధ్యర్థమున విధింపబడిన "లిఙ్" అను ప్రత్యయముతో గూడినది. ఆలోచింపగ, జ్యేష్ఠుడు కనిష్ఠుడు నగు నీరావణవిభీషణులలో ఒకరి గుణదోషములను విచారించునపుడు, ఇట్టి సంకటస్థితిలో తనకు ధర్మమును బోధించు చిన్నసోదరుని విడచి అనర్థము నొందుచున్న రావణుని యందే దోషము గలదు. పాపప్రవర్తనగల సోదరుని, మణి శిఖరమందున్న పామునువలె, విడిచివచ్చిన యీ విభీషణునికి దోష మేమాత్రము లేదు. ఆలోచింపక యితరునియందు దోష మారోపించినచో "దృష్టిచే పూతమైన తావునందే పాదమిడవలెను. వస్త్రముచే శుద్ధిచేయబడిన జలమునే త్రాగవలెను.

సత్యముచే పవిత్రమైన వాక్యమునే పలుకవలెను. ఇది పురాతనమైన ధర్మము'' అను న్యాయము విరోధించునని భావము.

7. లేదా, ఇంతవఱకు సోదరుడగు రావణునితో మిత్రత్వముతోవలె పదిమాసములు పరిమితిగల సీత నపహరించిన కాలము గడచినది. ఇప్పుడు సోదరుని భావమును నిశ్చితముగ దెలిసికొనుటచే శత్రుత్వము వచ్చినది. ఇప్పుడు అత్యంతము పుణ్యపురుషుల లాభము గలిగినచో మాసుకృతకామితముల ఫలము సిద్ధించుటయే కావున విడువను. దాతయయిన వీనికు సత్పాత్ర లభించినట్లుగ ఈతనికి సోదరునితో విరోధమువచ్చుట గొప్పశ్రేయస్సని భావము.

8. లేదా, మనకిద్దరకు అగ్నిసాక్షిగ స్నేహము కుదిరినదో దానిచే సుప్రసిద్ధమైనది. దానిచే ప్రాప్తమయిన అట్టి మిత్రమనెడు ఫలముయొక్క కోరికచే సంప్రాప్తమైనవాడు. "సంప్రాప్తం" యోగ్యముగా వచ్చినవాడు. జ్యేష్ఠసోదరునియందే సభామధ్యమున దోషమును ప్రకటించి, బలవంతుడగు శత్రువుతో కలసికొని, ఈతడు నాకేమి యపకారముచేయునో యని తలచి రావణుడుచేయు సంకల్పమువలన గలిగెడి అడ్డును పరిహరించికొని, కాలవశమున వచ్చిన విభీషణుని వదలను.

9. లేదా, మిత్రభావముతో తనకు జ్యేష్ఠసోదరుడు, నాకు ద్రోహముచేయువాడు నగు రావణునియందు, కుంభకర్ణుడు మారీచుడు మాల్యవంతుడు మున్నగువారలను జాతిస్వభావముచే క్రూరులు, తనకు ప్రతికూలముగ ధర్మమును

బోధించువారై యున్నవారునై యున్నను ఆదరింపక, కోప
ముచే సమస్తరాక్షసులను నేను హింసింపనై యుండగా వా
స్తవమైన శత్రువయ్యును మిత్రభావముచే వచ్చినవాడు. "కథం
చననత్యజేయం" త్రివిధము యిన శత్రుభావము నాలోచించియు
వదలుటకు సమర్థుడనుగాను. "కపోతోవానరశ్రేష్ఠ" అను
దాని ననుసరించి ప్రత్యక్షము చూడబడిన దోషముగల వధను,
శాస్త్రగంధశూన్యమైన కపోతవృత్తాంత ముదాహరించి కైము
తికన్యాయముచే ఇట్టిపురుషుని పరిగ్రహించి శరణమగుట,
ప్రాణదానముచే గ్రహించిన (రాముని యొక్క) ధర్మమును
సమర్థించుచున్నది. "సహితంప్రతిజగ్రాహ" అని.

స 18. శ్లో॥ 35. రామస్య తు వచ శ్శ్రుత్వా సుగ్రీవః ప్లవగేశ్వరః।
ప్రత్యభాషత కాకుత్స్థం సౌహార్దేన ప్రచోదితః॥

వ్యా॥ రామస్య తు వచ శ్శ్రుత్వే త్యనేన తతఃపూర్వ
తనస్వీయ విభీషణవిషయక దుష్టత్వబుద్ధినివర్తనేన సిద్ధి రితి లభ్య
తే। సౌహార్దేన- అత్యంతధర్మోపబృంహిత రామవాక్యపీయూష
పానజనితహృదయ ప్రకాశేన। అభిప్రచోదితః- రామచంద్రై స్తక
మత్యత్వరాయుక్తోఽనన్యసాధారణరామమాహాత్మ్య స్తుతిపూ
ర్వ మభాషత- యద్వా- ఉక్త మితి శేషః। మద్వివక్షిత
యావదంశసంబంధిగుణదోషవిమర్శపూర్వకం భవద్భి రుక్తం
శ్రోతు మిచ్ఛామి। అస్మిన్నపి పక్షే ఆత్మన స్సుహృద్వశంవ
దత్వం ప్రతీయతే॥

తా॥ "శ్రీరాముని వాక్యమును విని" అనుటచే అంతకు ముందు తనకు విభీషణునియందు పూర్వమందుండెడి దుష్టుడనెడి బుద్ధి తొలగుట సిద్ధించినదని తేలుచున్నది. "సౌహార్దేన" మిక్కిలి సౌహార్దముతో గూడిన శ్రీరాముని వాక్యమనెడు అమృతమును పానముచేయుటచే కలిగిన హృదయవికాసముచే "అభిప్రచోదితః" శ్రీరామచంద్రునితో నైకమత్యము నొందవలెనను త్వరతో గూడిన సుగ్రీవుడు, ఇతరులకు సాధారణముగాని శ్రీరాముని మాహాత్మ్యమును స్తోత్రముచేయుచు పలికెను.

లేదా, "ఉక్తం" అనుపదమును అధ్యాహారము చేసికొనునది. నేను వినగోరిన సమస్తమైన అంశములకు సంబంధించిన గుణదోషములను విమర్శించుచు తమరు చెప్పుదానిని విన గోరుచున్నాను. ఈపక్షమునను తాను స్నేహితునకు స్వాధీనుడైనాడని తోచుచున్నది.

స 18. శ్లో॥ 36. కిమత్ర చిత్రం ధర్మజ్ఞ లోకనాథ సుఖావహ।
యత్త్వమార్యం ప్రభాషేథాః సత్త్వవాన్సత్పథే స్థితః॥

వ్యా॥ త్వదీయ ధైర్యప్రకటనాయైవ మమాయ ముద్యోగ ఇతి సుగ్రీవః రామప్రభావం వర్ణయతి । కిమత్ర చిత్ర మితి । సర్వాత్మనా నమ్రీభూయ శరణ మాపన్నస్య విభీషణస్య రక్షణే తవ కిం చిత్రం- యతః లోకనాథానా మింద్రాదీనా మప్యత్యంతపీడాహేతుభూత రావణాది దుష్టనాశనేన సుఖాధానే బద్ధకంకణస్య తవేతి భావః । ఏతాదృశానితరసాధారణశక్తేశ్చ

మూల మిద మే వేత్యాహ। య త్త్వ మార్య మితి- మహ త్యపి సంకటే స్థిత్వా ధైర్యమే వాశ్రిత్య ఆర్యలోకపూజ్యం వచనం ప్రభాషేథా ఇతి। 'న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి' ఇతి న్యాయేన ఆపన్నరక్షణకథాశ్రవణమాత్రేణ తద్వశీభూతస్య తవేదం నాపూర్వం భద్ర మితి భావః। యద్వా- ఆర్యం- సజ్జనహృదయాహ్లాదకం వచన మితి శేషః। ప్రభాషేథాః- స్ఫుటం వదే రితి। కస్యా ప్యనుద్వేగకరం వచనం బ్రవీషీతి యత్। ఇదం తవ న చిత్రం- ఆశ్చర్యం న భవతి। కుతః- లోకనాథ- సర్వప్రభో। సుఖావహ- సర్వథా సర్వసుఖాధాయక- త్రికరణై రపి సర్వజంతుసామ్యేన సుఖం సంయోజ్య లోకప్రభుత్వం నిర్వహ్యా మీతి నిశ్చినవానస్య తవేదం నాభూతపూర్వ మితి భావః। స త్త్వవాన్- "క్షీరిణో వృక్షాః" ఇతి వత్, నిత్యం తవ ధైర్యసంబంధ ఇత్యర్థః। ఇదం చ సతాం సాధారణో ధర్మః ఇతి సత్పథే స్థిత ఇతి। అయం చ స్వభావః। 'స్వభావో దు స్త్యజ' ఇతి న్యాయేన తవ దు స్త్యజ ఇతి భావః॥

ఇతి శ్రీ మద్రామాయణే హారితసగోత్రోద్భవేన బొమ్మకంటి నృసింహశాస్త్రిణా విరచితాయాం కల్పవల్లికాఖ్యాయాం వ్యాఖ్యాయాం యుద్ధకాండ కిసలయః

---

తా॥ నీ ధైర్యమును ప్రకటించుటకే నా యీ ప్రయత్నమని సుగ్రీవుడు శ్రీరాముని ప్రభావమును వర్ణించుచున్నాడు. 'కిమత్రచిత్రం' సర్వవిధముల నమ్రుడై శరణమునొందిన విభీషణుని నీవు రక్షించినావన్న ఇందు చిత్రమేమి? 'లోకనాథ సుఖావహా' ఇంద్రాదిలోకపాలురకును మిక్కిలి పీడనొసగుటకు కారణమైన రావణాదిదుష్టులను నశింపజేయుటచే వారికి సుఖము గలిగించుటయందు కంకణముగట్టినవాడవు నీవని భావము. ఇట్టి యితరులకు లేని శక్తి కలుగుట కిదియే కారణమని దెలుపుచున్నాడు. "యత్త్వమార్యంప్రభాషేథాః" కష్టము తటస్థించినను గొప్పధైర్యము వహించి, పెద్దలచే గౌరవింపబడు వాక్యమును పలికితివో, 'లోకకల్యాణము జేయువాడెవడును దుర్గతినొందడు' అను గీతావాక్యము ననుసరించి, ఆపన్నుని రక్షింపవలెనను కథ విన్నంతమాత్రముననే, వారికి స్వాధీనుడవగు నీ కిది యొక క్రొత్తదగు మంగళముగాదు.

లేదా, "ఆర్యం" సజ్జనహృదయమునకు నాహ్లాదము కలుగజేయు "వచనం" వాక్యమును, "ప్రభాషేథాః" స్పష్టముగ బలికినాడవు. ఎవరికి ఉద్వేగము (వ్యాకులత) ను గలుగజేయని వాక్యమును బలుకుచుంటిననుట యేది గలదో, 'ఇదం' ఇది, "తవనచిత్రం" నీ కాశ్చర్యము గాదు. "కుతః" ఎందువలననగా, "లోకనాథ" సర్వలోకప్రభుడవు. "సుఖావహా" సర్వవిధముల నందరకు సుఖమును గూర్చువాడవు. మనోవాక్కాయములచే

సమస్తజంతువులకు సమానముగా సుఖమును గూర్చి, లోకప్రభుత్వము నిర్వహించెదనని నిశ్చయించు నీకు ఇది యొక క్రొత్తగాదని భావము. "సత్వవాన్" క్షీరవృక్షమన, నిత్యము క్షీరము గల వృక్షమనినట్లు, నిత్యము ధైర్యముతో గూడినవాడవని యర్థము. ఇది సత్పురుషులకు సాధారణమైన ధర్మమని తెలుపుటకై 'సత్పథేస్థితః' అనినాడు. ఇది నీకు స్వభావము. స్వభావము విడువదగను గాన నీ కీశరణాగతరక్షణము యెల్లవిధముల విడువజనదని భావము.

ఇది బొమ్మకంటి వంశోద్భవ, నృసింహశాస్త్రి జ్యేష్ఠపుత్ర,
రామలక్ష్మీగర్భసంజాత, బుధజనవిధేయ, సుబ్రహ్మణ్య
శాస్త్రి విరచితంబైన ఆంధ్రతాత్పర్యమున
అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ
కాండములు సమాప్తము.

---

# సింహావలోకనము.

వాల్మీకిమహర్షి విరచితంబైన శ్రీమద్రామాయణము నకు మనదేశమందు వ్యాప్తిలోనున్న వ్యాఖ్యానచతుష్టయము గాక యితరసంస్కృతవ్యాఖ్యలనేకములుఁ గలవని పెక్కుమందికి విదితమైన విషయమే. కాని శ్రీరాముడు శక్తిస్వరూపుడని ప్రతిపాదించి సిద్ధాంతీకరించిన వ్యాఖ్యానం బిదిమాత్రమే యని నాయూహ.

వేదశాస్త్రములం దుత్తీర్ణులైన పండితకుటుంబమునఁ దప శ్శాలురగర్భమం దుదయించి, షట్ఛాస్త్రములయం దారూఢ మైన పాండితీవైభవముఁ గలిగి, జగదీశ్వరీచరణారవిందసేవా ధురంధరులై, నిరుపమానకవితానిపుణులై, పురాణరహస్య వేత్తలై, పౌరాణికాగ్రగణ్యులై, తంత్రాగమాదిరహస్యపరిజ్ఞా తలై, యాదికావ్యంబునకుఁ బరాశక్తిపరముగ దైవభాషలో గ్రంథకర్తలు కల్పవల్లిక యను నొక యపూర్వవ్యాఖ్యను రచించి యుండిరి.

అద్దానికిఁ బండితపరిష్కృతమైన యాంధ్రానువాదము గూడఁ దోడుజేసి నే బ్రకటించిన ప్రథమ ద్వితీయ సంపుటము లకు వ్యాకరణవిద్యాప్రవీణులు బ్ర॥ శ్రీ॥ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు, సాహిత్యవిశారదులు బ్ర॥ శ్రీ॥ కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రిగారును వారి నిరుపమసార్థకములైన పీఠికలను వ్రాసి నూతనాంశములఁ గొన్నింటినిఁ జనులకు దెలుపరచియున్నారు.

ప్రస్తుత మీ వ్యాఖ్యయం దంతటను ప్రతిశ్లోకమునం గానంబడు సర్వవిశేషములను గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపక, సామాన్యముగ ప్రథానఘట్టస్థలములను పాఠకుల సౌకర్యార్థమై సూక్ష్మముగ నిచ్చటం గ్రోడీకరించుచున్నాడను.

## 1. గ్రంథవ్యుత్పత్తి.

రామాయాః (త్రిపురసుందరియొక్క) అయనం (స్థానము) రామాయణం

## 2. ఉపోద్ఘాతవిశేషము.

భగవాన్ శ్రీ హంసయోగి విరచితంబైన సనాతనధర్మదీపికయందలి నీక్రిందివిషయములు, బాల, అయోధ్య, అరణ్య, కాండముల ప్రారంభమునంగల యుపోద్ఘాతాంశములను స్థిరీకరించుచున్నయవి. ప్రథమసంపుటము. పుట (6-11) ద్వితీయసంపుటము. పుట (1—3) తృతీయసంపుటము. పుట (1 చూడుడు )

## ఖండము 1. అధ్యాయము 1.

శ్లో॥ 76. "రాఘవత్వే౽భవ త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని ।
అన్యేషు చావతారేషు సహధర్మచరీ చ మే॥

You were Sita when I was Raghava. You were Rukmini when I was born as Krishna. And in all other incarnations of mine you were my consort helping me in my work.

## ఖండము 2. అధ్యాయము 1.

శ్లో॥ 81. ప్రథమం బ్రహ్మపరమం శ్రీయమాశ్లిష్ట మేవచ ।
నానారూపం చ భవతి సర్వోపాస్యం హి తద్భవేత్॥

Parabrahmam is the first ever united to Sree or Sakti, eternal, and changeless, but manifests itself in myriad forms; hence it should be the object of meditation to all.

## అధ్యాయము 2.

శ్లో॥ 48 & 48½ పురా వల్మీకినా ప్రోక్తే దివ్యే రామాయణే శుభాః।
చతుర్వింశతిగీతాస్స్యుః షట్సు కాండేషు సిద్ధిదాః॥
ప్రతికాండం చతస్రస్స్యుః గీతాశ్చేతి చ నిర్ణయః॥

The Divine Ramayana composed of yore by Valmiki contains in the six cantos twenty-four Geetas of mighty potency; for each canto comprises in itself, four of these Geetas.

శ్లో॥ 210. ప్రవృత్తిర్హి జగన్మాతా నానాభావా యథాయుగం॥

The world-mother is the myriad-formed manifestation that adapts itself to the varions cycles.

శ్లో॥ 299. 300. యథా బ్రాహ్మ్యా పరంబ్రహ్మస్వశక్త్యా భాతిరూపవత్।
సచ్చిదానందరూపంచ పరంధామ విభూతిమత్ ।
తాం దేవీం పరమాం శుద్ధాం బ్రాహ్మీం శక్తిం పరాయణీం॥

That brahmaic Sakti through which Parabrahmam appears to us as if embodied, as if invested with the attributes of be-ness, consciousness, and bliss as the snpreme state and as if endowed with manifold powers, that brahmaic Sakti, the great Goddess, supremely Pure, the final Goal,

శ్లో॥ 301. ఉపాసంతేహి యోగీన్ద్రాః యథాభావ మనుత్తమం ।
సంసారేషు చ సర్వేషు సైవమాతా పరావరా॥

is meditated upon by the great yogis as best they might. In all universes She is regarded as the great mother, higher than the highest, subtler than the subtlest.

శ్లో॥ 335. తయ శ్శక్తిసమావిష్టాః పురుషాః బ్రహ్మరూపిణః ।
వ్యవసాయం స్వకార్యం చ కుర్వన్తిహి యథాబలం॥

It is also why persons who have realised Brahmam perform their functions in the universe as best they might, through being permeated with this Sakti.

శ్లో॥ 336. ఉపాఖ్యానాని సర్వాణి చైతత్తత్త్వం వదన్తిహి ।
అత ఏవ హి సీతాహి రామం నారాయణం విభుం॥

All the leading episodes in our religious books teach but this truth. Hence it is that Seeta strongly reminds Rama who is no other than the Omnipotent Narayana.

శ్లో॥ 337. పుంసా మజానాం శాస్తారం శుద్ధసంకల్పనాయకం ।
వనప్రస్థఃచానుశాస్తి వేద్యస్తదధికారిభిః॥

The Ruler of the unborn Purushas and the Lord of Pure Resolve (Suddha Sankalpa) on the eve of his departure to the forest. The Hierarchs in this mandala should ponder deeply over it.

శ్లో॥ 338. కింత్వామన్యత వైదేహః పితా మే మిథిలాధిపః ।
రామజామాతరం ప్రాప్యస్త్రియం పురుషవిగ్రహం॥

Rama! I would give anything to know what my father Videha, the ruler of mithila thought of you when he secures for a son-in-law a woman in the guise of a man."

## 3. శాస్త్రవిశేషములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. వాల్మీకిః | సంపుటము 1. | పుట | 5,6,14,15 | చూడుడు. |
| 2. ఈశ్వరతరా | ,, | ,, | 68—70 | ,, |
| 3. సహంతే | ,, | ,, | 99 | ,, |
| 4. రామజామాతరం | సంపుటము 2. | ,, | 107—112 | ,, |
| 5. అనువిధీయతే | ,, | ,, | 26—28 | ,, |
| 6 ధర్మోపసంహారల | సంపుటము 3 | ,, | 54—57 | ,, |

## 4. రసవిశేషములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఇక్ష్వాకువంశప్రభవః | సంపుటము 1. | పుట | 44—45 | చూడుడు. |
| 2. కౌసల్యానందవర్ధనః | ,, | ,, | 54—57 | ,, |
| 3. అహం | ,, | ,, | 88—90 | ,, |

| | | | |
|---|---|---|---|
| 4. సత్యపరాక్రమం | సంపుటము 1. | పుట 88—90 | చూడుడు. |
| 5. శ్లో॥ వచు...కౌశిక | ,, | ,, 107—114 | ,, |
| 6. శ్లో॥ ఇయం...పాణినా | ,, | ,, 114—120 | ,, |
| 7. శ్లో॥ అనురూప ..త్తరం | సంపుటము 2. | ,, 18—23 | ,, |
| 8. సాగరోఽభాస్కరోదయే | ,, | ,, 38—40 | ,, |
| 9. నాహమర్థపరో దేవి | ,, | ,, 61—67 | ,, |
| 10. శ్లో॥ నచాస్య...శుపా | ,, | ,, 72—75 | ,, |
| 11. శ్లో॥ మత్స్యే...ర్దళ | ,, | ,, 153—155 | ,, |
| 12. అపాసర్పత్ | సంపుటము 3. | ,, 32—37 | ,, |
| 13. నవీరసేవాగణశోచి | ,, | ,, 52—53 | ,, |
| 14. వజ్రమాదాయ | ,, | ,, 52—53 | ,, |
| 15. శ్లో॥ నతు...నాశనః | ,, | ,, 54—60 | ,, |

## 5. భావవిశేషములు.

| | | | |
|---|---|---|---|
| 1. తపస్స్వాధ్యాయనిరతం | సంపుటము 1. | పుట 1,2,8—11 | చూడుడు. |
| 2. వాగ్విదాంవరం | ,, | ,, 1–4, 11–13 | ,, |
| 3. సముద్రఇవగాంభీర్యే | ,, | ,, 55—58 | ,, |
| 4. ధైర్యేణహిమవానివ | ,, | ,, 55—58 | ,, |
| 5. కౌసల్యాసుప్రజారామ | ,, | ,, 94—98 | ,, |
| 6. అతర్కితం | ,, | ,, 103—104 | ,, |
| 7. శ్లో॥ జనకానాం...త్మజా | ,, | ,, 104—111 | ,, |
| 8. నచకాలవశానుగః | సంపుటము 2. | ,, 15—16 | ,, |
| 9. శ్లో॥ నహి...రాఘవే | ,, | ,, 41—46 | ,, |
| 10. శ్లో॥ ననూనం...సతీ | ,, | ,, 67—71 | ,, |
| 11. శ్లో। సాత...రాఘవం | ,, | ,, 105—106 | ,, |
| 12. శ్లో॥ కింత్వా...విగ్రహం | ,, | ,, 106—113 | ,, |
| 13. మిత్రభావేన | సంపుటము 3. | పుట 68—80 | ,, |

## 6. ఇతర వ్యాఖ్యలఖండనము.

| | | | |
|---|---|---|---|
| 25. ప్రవిశ్యాతు | సంపుటము 3. | పుట 3—6 | చూడుడు. |
| 26. శ్లో॥ రాజ్య...చలే | ,, | ,, 16—18 | ,, |
| 27. శ్లో॥ నజానే...కులం | ,, | ,, 42—44 | ,, |
| 28. అథ...ప్రచోదితః | ,, | ,, 62—65 | ,, |
| 29. భవద్భిః | ,, | ,, 65—68 | ,, |

ప్రథమసంపుటమున పాయసవిభాగసందేహపరిహారము చెప్పబడినది. (పుట 125—132 చూడుడు.)

ద్వితీయసంపుటమున శ్రీరామపట్టాభిషేక ప్రసంగమున భరతుని యనాహ్వానవిషయమైన సందేహమునకు పరిహారముఁ జెప్పబడినది. (పుట 165—192 చూడుడు.)

ఈసంపుటముననే దైవపురుషకారములలో దేనికి ప్రాధాన్యమో బాగుగఁ జర్చించి తృతీయసంపుటమున నీవిషయమే దృష్టాంతముతో స్థిరీకరింపబడినది.
(సం. 1. పుట 15—16 సం. 2. పుట 6 చూడుడు.)

తృతీయసంపుటమున శ్రీరాముని వనగమనవిషయమై కైకేయియం దారోపింపబడిన దోష ముపసంహరింపబడినది. (పుట 14—15 చూడుడు.)

ఈసంపుటముననే శూర్పణఖను గురించి రామలక్ష్మణుల వాక్యము లపరిహాసకరములని సమర్థింపబడినవి.
(పుట 29—31 చూడుడు.)

ఇట్టి యమూల్యసంపదలచే విరాజిల్లిన భారతవాణీ విలాసములను భరతమాత గర్భమునఁ జన్మించినవార లందరుఁ బోషించి పఠించి శ్రీపరదేవతానుగ్రహభాజనులై పురుషార్థములనుఁ జేకూర్చుకొందురుగాక.

ఓం తత్సత్.

ఇట్లు,
బుధజనవిధేయుడు,
బొమ్మకంటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

# తప్పు ఒప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 19 | బ్రాహ | బ్రాహ్మ |
| 18 | 2 | రాజ్య | రాజ్య |
| ,, | 19 | ఏహా | ఏహి |
| 19 | 10 | శుఖే | శుభే |
| 26 | 20 | లోకాన్ | లోకాః |
| 29 | 4 | శూర్ఫ | శూర్ప |
| ,, | 8 | ,, | ,, |
| ,, | 13 | ,, | ,, |
| 30 | 8 | ,, | ,, |
| ,, | 16 | ,, | ,, |
| ,, | 22 | ,, | ,, |
| 34 | 2 | రసాతిరేకేణో | రసాతిరేకేణ |
| 51 | 13 | భవతీ | భవంతీ |
| 70 | 5 | తమ్బుద్యా | తమ్బుధ్యా |
| 77 | 11 | నత్యనేయం | నత్యజేయం |
| 84 | 13 | సమాప్తము | సమాప్తములు |
| 88 | 21 | సహంతే ” | సహంతే ” 2 |
| 91 | 9-10 | పరిహారముఁజెప్పు | పరిహారముచెప్పు |

## బొమ్మకంటి నృసింహశాస్త్రి స్మారకనిధి వివరములు.

ఈనిధిని సమకూర్చుటకు శ్రీ శాస్త్రిలవారిచే సంస్కృతభాషలో రచింపబడి దిగువ పేర్కొనబడిన గ్రంథములకు పోషకులను చందాదారులను జేర్చుకొనుట, గ్రంథములను తెలుగులిపిని, నాగరిలిపిని ముద్రింపించుట, ముద్రితగ్రంథములను విక్రయించుటయు ముఖ్యోద్దేశములు. ఈనిధికి సంబంధించిన కార్యములన్నియు శ్రీ శాస్త్రిలవారి జ్యేష్ఠకుమారులు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి స్వగృహమందు గ్రంథకర్తల స్మారకార్థము శాశ్వతముగ నెలకొల్పిన [?]లయమునందు జరుపబడుచుండును.

అముద్రితగ్రంథములు, చందాలు:—(1) కల్పవల్లికా (శ్రీమద్రామాయణవ్యాఖ్యా) ఆరుకాండములు కలసి నాగరిలిపి రు 5—[?]
(2) మణిమంజరీవిశ్లథం. నాగరిలిపి రు 2—0—0 తెలుగులిపి రు 1—[?]
(3) తారావళి, తిలకసహస్రం etc రు 1—0—0 తెలుగులిపి రు 1—[?]

పోషకులు:—రు 10—0—0 లు గాని యంతకుమించిగాని ఒకే పర్యాయము నిచ్చువారు. వీరికి గ్రంథములన్నియు ముద్రణానంతర ముచితముగ నియ్యబడును.

చందాదారులు:—ఏగ్రంథమునకైనను చందాలను ముందుగ నిచ్చువారు. వీరి కాయాగ్రంథములు ముద్రణానంతర ముచితముగ నియ్యబడును

ముద్రితగ్రంథములు:—కల్పవల్లికా (శ్రీమద్రామాయణ వ్యాఖ్యా[?]) ఆరుకాండముల వ్యాఖ్యానము, ఆంధ్రతాత్పర్యసహితము, గ్రంథకర్త జీవితచరిత్రము, వంశచరిత్రము, వంశావళి, పండితాభిప్రాయములు, పత్రికాభిప్రాయములు, సింహావలోకనమును జేర్చి మూడుసంపుటములుగ నాంధ్రలిపిని ముద్రింపబడినది.

సంపుటములు మూడు కలసి రు 3—0—0 (ఖర్చులు వేరు)

విడిప్రతి. ప్రథమసంపుటము రు 1—4—0 ( ,, )
,, ద్వితీయసంపుటము రు 1—8—0 ( ,, )
,, తృతీయసంపుటము రు 1—0—0 ( ,, )

దరఖాస్తులు, చందాలు వగైరాల నీక్రిందివిలాసమునకు పంపవలెను.

**కల్పవల్లిక ఆఫీసు, రామారావుపేట, కాకినాడ.**

తూర్పుగోదావరిజిల్లా.